# కిన్నెర

మార్చి 1953

## విషయసూచిక




ఎడిటర్ పందిరి మల్లికార్జునరావు
అసిస్టెంట్ ఎడిటర్ పందిరి మీరాబాయి

సంపుటము 5 | మార్చి 1953 | సంచిక 3

# ప్రాచీన గ్రంథ పరిష్కారణం

ఇటీవల మద్రాసులో భాషాసేవకసమితి యాజమాన్యాన జరిగిన గోష్ఠిలో శ్రీ జులుసు వేంకట రమణయ్యగారు ప్రాచీన గ్రంథపరిష్కారణ విషయంలోని లోటుపాటులను గురించి ప్రసంగించారు దేశంలోని ఒక్కొక్క గ్రంథానికీ దొరికే అన్ని ప్రతులను పరిశీలించి, సరియైన పాఠనిర్ణయానికి రావడం ఎంతయినా అవసరమనిన్నీ, కనీసం ఆ పని కవిత్రయంవారి భారతానికైనా జరగాలనీ శ్రీ వేంకట రమణయ్యగారు అన్నారు

ప్రాచీన గ్రంథపరిష్కారణం తేలికపని కాదనీ, దానిలో చాలా చిక్కులున్నవనీ, గ్రంథపరిష్కారానికి సంప్రదాయజ్ఞానం, చారిత్రకదృష్టి, భాషాజ్ఞానం చాలా అవసరమనీ, అవి లేకుంటే భాషాస్వరూపమే తల్లక్రిందులు కాగలదనీ తమ ప్రసంగంలో శ్రీ వేంకట రమణయ్యగారు హెచ్చరించారు

శ్రీ వేంకట రమణయ్యగారు వెల్లడించిన భావాలతో ఏకీభవించనివారు ఎవరూ ఉండజాలరు తెలుగులోని ప్రాచీన గ్రంథాలన్నిటికీ పరిశుద్ధ సంస్కరణలను తయారుచేయడం చాలా అవసరమనే విషయాన్ని పెక్కుసారులు మేమును వ్రాసియుంటిమి ఇంతేకాకుండా విజ్ఞానసర్వస్వం, సమగ్రమైన వ్యాకరణం, నిఘంటువు, ఆంధ్రదేశ చరిత్ర, భాషాచరిత్ర, సారస్వత చరిత్ర మొదలయిన గ్రంథాలు—సమగ్రమయినవీ, అధికారయుక్తంగా వ్రాసినవీ కావలెననికూడ వ్రాసియుంటిమి

ఆంధ్ర సాహిత్య పరిషత్తు పెక్కు ప్రాచీన గ్రంథాలను సంస్కరించి ప్రకటించియున్నది కాని, ఇట్లాంటి పరిష్కృత సంస్కరణమును కనీసం కవిత్రయంవారి భారతానికయినా వెలువరించియుంటే ఇంకా బాగా ఉండేది ఇట్టి మహాకార్యం జరగాలంటే ఏ ఒకరిద్దరి వ్యక్తులవల్లనో జరుగగలిగిన పనికాదు కాబట్టి, తెలుగుభాషా సమితి, ఆంధ్ర సారస్వత పరిషత్తు, ఆంధ్ర విశ్వకళా పరిషత్తు ఆదిగాగల సంస్థలద్వారా ఇట్టి పని జరుగవలసి ఉంటుంది అటువంటి సంస్థలు దీనికి పూనికొని, తెలుగులోని మహాకవుల రచనలకన్నిటికి ప్రామాణికములయిన శుద్ధప్రతులను తయారు చేయించి, ప్రకటించినట్లయితే ఆంధ్ర సారస్వతానికి గొప్ప సేవ కాగలదు.

కిన్నెర

కవిత్రయంవారి భారతాన్ని ప్రచురించుటకు ఆంధ్ర విశ్వకళాపరిషత్తువారు వెనుక కొంత ప్రయత్నించినట్లు తెలుస్తుంది కాని, ఏ కారణంచేతనో అది విరమింపబడి, మరియొక ప్రణాళికకు ఆ కేటాయించిన ధనాన్ని వినియోగించినట్లు తెలియవస్తుంది దీనిని గురించి విశ్వకళా పరిషత్తువారే చెప్పవలసి ఉంటుంది

ఇప్పుడయినా ఆంధ్ర విశ్వకళాపరిషత్తువారు ఇట్టి గ్రంథప్రచురణయొక్క అవసరాన్ని గుర్తించి, ఆయా శాఖలలో పండితులయిన పెద్దలతో కమిటీలను ఏర్పరచి ఈ పనికి వెంటనే పూనుకోవలసినదిగా మా మనవి

ఒక్క కవిత్రయంవారి భారతమేకాక, ఎన్నో గ్రంథాలు తెలుగులోకి రావలసిఉన్నవి మేము పైన మనవి చేసినట్లుగా ఆంధ్ర వ్యాకరణం, నిఘంటువు, ఆంధ్రదేశ చరిత్రకూడ తెలుగులోకి వెంటనే రావలసిన గ్రంథాలు

తెలుగు భాషా సమితివారు విజ్ఞానసర్వస్వ ప్రచురణకు పూనుకొన్నారు త్వరలోనే సంపుటములు అచ్చుకానున్నవి. ఆంధ్రులకు, ఆంధ్రదేశానికి ఉపయుక్తమయినట్టివీ, ప్రామాణికమయినట్టివీ విజ్ఞానసర్వస్వాన్ని తెలుగు భాషా సమితి ప్రసాదించగలదని ఆశింపవచ్చును

విజ్ఞాన సర్వస్వంతోపాటు సమగ్రమయినట్టివీ, తెలుగుతనాన్ని వ్యక్తీకరింపగలిగినట్టివీ, తెలుగుపాఠకులకు ఉపయుక్తంకాగలిగినట్టివీ ఒక ప్రామాణిక నిఘంటు ప్రచురణకు తెలుగు భాషా సమితి పూనికోవలసినదిగా మా ప్రార్థన

అట్లే సమగ్రమయిన ఆంధ్ర వ్యాకరణ రచనకు కూడ తెలుగు భాషా సమితి పూనుకోవలసిన కార్యాలలో ఒకటిగా ఉండవలెను తెలుగు భాషాసమితి ప్రధాన సంపాదకులయిన డాక్టర్ గిడుగు సీతాపతిగారి నేతృత్వంక్రింద ఈ రెంటును సంతృప్తికరంగా నెరవేరగలవని భావింప వచ్చును

ఆంధ్రుల చరిత్రను సంపూర్ణంగాను, అనుస్యూతంగాను ఈయగల ఒక గ్రంథం అవసరంకూడ ఎంతేని ఉన్నదని చెప్పనవసరంలేదు కీర్తిశేషులయిన చిలుకూరి వీరభద్రరావుగారి "ఆంధ్రుల చరిత్ర" ప్రకటితమయి రెండు దశాబ్దాలు పైగా అయినది అటుపిమ్మట చారిత్రక పరిశోధకుల కృషిఫలితంగా ఎన్నో నూతన విషయాలు బయలుపడినవి ఈ నూతన పరిశోధనాఫలితాన్ని ఉపయోగించి ఆంధ్రుల సమగ్రచరిత్ర గ్రంథాన్ని తెలుగులోకి ఒకటి తీసుకురావాలి

గత ముప్పది, నలుబది సంవత్సరాలనుంచీ పెక్కురు చారిత్రక పరిశోధకులు శ్రమించి, చాల పుస్తకాలను, పెక్కువ్యాసాలను ప్రచురించారు కానైతే, సమగ్రమయినట్టివీ, అనుస్యూతమయినట్టివీ, ప్రామాణికమయినట్టివీ ఆంధ్రదేశ చరిత్ర గ్రంథం తెలుగులో ఇంతవరకు ఒకటికూడ రాలేదు

తెలుగు భాషా సమితి ప్రచురింపనున్న "ఆంధ్ర" సంపుటానికి ప్రధాన సంపాదకులయిన శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మగారు సుప్రసిద్ధ చరిత్రకారులు, తమ జీవితాన్నంతయు చారిత్రక పరిశోధనకే అంకితించేసి, విశేష ప్రజ్ఞాప్రాగల్భ్యాలను సంపాదించుకొన్నవారు శ్రీ శర్మగారి ప్రధాన సంపాదకత్వంక్రింద ఆంధ్రదేశ చరిత్ర గ్రంథరచనకుకూడ తెలుగుభాషాసమితి సంకల్పిస్తే హర్షింపదగిన విషయం

విజ్ఞానసర్వస్వంతోపాటు వ్యాకరణం, నిఘంటువు, చరిత్ర—ఈ మూడింటినీ తెలుగు భాషా సమితి ఆంధ్రదేశానికి సమర్పింపగలిగితే, భాషకు, దేశానికి మహోపకారం కాగలదు ఇందుకు తెలుగు భాషాసమితి పూనుకొంటుందా?

# ఆంధ్ర వ్యాకరణము

ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక 41 వ సంపుటం సంచిక 1-6 (నందన సంవత్సరం చైత్ర-భాద్రపదములు)లో "ఆంధ్ర వ్యాకరణము" అనే సంపాదకీయ వ్యాసం ప్రకటితమయినది "కిన్నెర" నవంబరు (1952) సంచికలో "వాడుకభాష - విశ్వవిద్యాలయాలు" అనే మా సంపాదకీయాన్ని గురించి ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక చర్చిస్తూ వ్రాసిన సంపాదకీయ వ్యాసం అది పరిషత్పత్రిక సంపాదకీయాన్ని మేము ఈ నెల "ఏరిన ముత్యాలు" అనే శీర్షికలో సంపూర్ణంగా ప్రచురించినాము.

"వాడుకభాషయొక్క ప్రాశస్త్యమును దెలిపి యట్టి ప్రశస్తమైన భాషను విశ్వవిద్యాలయములు వెంటనే యాదరింపవలెనని నివేదించెను మొదట నది చిన్నయసూరిపై ధ్వజమెత్తెను అనంతరము వ్యావహారిక భాషాపోషకులగు కందుకూరి వీరేశలింగము పంతులుగారిని, గిడుగు రామమూర్తి పంతులుగారిని, గురజాడ అప్పారావుగారిని ప్రశంసించెను" అని మా సంపాదకీయంలో వెలిబుచ్చియున్నామని సాహిత్య పరిషత్పత్రిక వ్రాసినది

వ్యావహారిక భాషా ప్రాశస్త్యమును తెలుపుతూ, అట్టి ప్రశస్తమైన భాషను విశ్వవిద్యాలయాలు వెంటనే ఆదరింపవలెనని మేము కోరియుంటిమి కాని, ఆ పత్రిక వ్రాసినట్లు చిన్నయ సూరిపై ధ్వజమెత్తుట మా అభిప్రాయమూ కాదు, అభీష్టమూ కాదు ఆంధ్రభాషకై పరిశ్రమించి, తమ రచనల ద్వారా సారస్వతాన్ని పరిపుష్టం చేయడానికి సంకల్పించి, పూనుకొన్న పెద్దలందరూ మాకు అభివందనీయులే, ప్రశంసింపతగినవారే ఆ దృష్టితో చూచినయెడల చిన్నయసూరియెడల ఆంధ్ర సారస్వత పరిషత్పత్రికకు ఎట్టి గౌరవ ప్రపత్తులు కలవో అట్టి గౌరవప్రపత్తులే మాకును కలవు అట్లే చిన్నయసూరి సదభిప్రాయాన్నిగూర్చికూడ మేమెంత మాత్రం శంకింపము కానైతే, చిన్నయసూరి రచనలద్వారా తెలుగుభాషకు, తెలుగు సారస్వతానికి కలిగిన కీడుమేళ్ల తహతేడా వేసిచూచునప్పుడు నిష్పాక్షికంగాను, వాస్తవిక దృక్పథంతోను పరిశీలించవలసి ఉంటుందని మా మనవి

ఏ కారణమువల్లనైతేనేమి, చిన్నయసూరి బాల వ్యాకరణమువలన వాడుకగా వస్తూవున్న భాషాసంప్రదాయం మారి, అది మరింత సుబోధకం అగుటకు మారుగా మరింత కష్టమై, క్లిష్టమైనదని మా అభిప్రాయం. అంతే కాని చిన్నయ సూరిని న్యూనతపరచడం మా ఉద్దేశం ఎంత మాత్రంకాదు నిష్పాక్షికదృష్టితోను, వాస్తవికపరిస్థితుల సమన్వయపరిజ్ఞానంతోను ఆలోచించేవారందరూ మా అభిప్రాయంతో ఏకీభవింపగలరు

"జీవద్భాష కెవరును సమగ్రమైన వ్యాకరణము వ్రాయలేరు నేటి భాషకు బాలవ్యాకరణము సమగ్రమైన వ్యాకరణముకాదు" అని పరిషత్పత్రిక వ్రాయుచున్నది. కావుననే, వ్యాకరణం కాలానుగుణంగా మారుతూ ఉండాలనీ మా అభిప్రాయం చిన్నయ సూరి బాలవ్యాకరణం ఇప్పటికి వందేళ్లనాటిది నాటినుంచి నేటివరకు భాషలో ఎంతో మార్పువచ్చినది కాబట్టి, నేడు శిష్టజనవ్యవహారమైన తెలుగుభాషను గ్రహించడం ఎంతయు సమంజసం

"ఎవరికి దోచినట్లు వ్రాయుచున్నారు శిష్టమైనభాష యను బాధలేక యెట్టిదైనను చలామణియగుచున్నది సర్వజనసమ్మతమైన యొక భాషానుశాసనము లేనిదే యిది శిష్టము, ఇది యశిష్టమని యెవరు చెప్పగలరు? ఎవరికి వారు తాము వ్రాసిన భాషనే శిష్టముగా దలంచుచున్నారు. భాష నియమరహితమైనచో నిట్టి యనర్థములే సంభవించుచుండును నియమరహితమైన భాష యెప్పటికిని సర్వజనాంగీకారమును బడయజాలదు" అని పరిషత్పత్రిక వ్రాసినది

పరిషత్పత్రిక వెల్లడించిన అభిప్రాయాలతో ఏకీభవింపజాలకపోవుటకు ఎవరికిని ఎట్టి కారణం ఉండజాలదు ఏతత్పత్రిక పేర్కొన్నట్లు "నేటి భాషకు బాలవ్యాకరణము సమగ్రమైన వ్యాకరణంకాదు" గనుక "తెలుగు భాషకు సజాతీయేతర భాషలతోగల సాదృశ్యములను నిరూపించుచు," 'ఇది శిష్టము, ఇది యశిష్టము'' అని చెప్పగల వ్యాకరణం కావలెనని యే మా అభిప్రాయమును

శ్రీ గిడుగు సీతాపతిగారు రచించుచున్న వ్యాకరణము తామొక్కరే తమకు దోచినవిధమున వ్రాయదలంచ లేదని మాత్రము మనవిచేస్తున్నాము. "ప్రాచీన సంప్రదాయానుసారులైన సుప్రసిద్ధులగు పండితుల, భాషాశాస్త్ర సంప్రదాయవిదుల సహకారంతోనే" ఈ వ్యాకరణరచన కావింపబడుచున్నది సర్వపక్షసమ్మతమై సర్వాంధ్రదేశమునకు వ్యవహారయోగ్యమైన వ్యాకరణము" కావలయునని యే మా అభిప్రాయంకూడా అందుకు ఒక సర్వపక్షసమావేశం జరిపించవలెననికూడా మేము ప్రయత్నిస్తున్నాము.

మేము తలపెట్టిన ఈ కార్యక్రమంలో ఆంధ్ర సాహిత్య పరిషత్తువారును తోడుపడి, ఇది జయప్రదం అయ్యేటట్లు తమ సంపూర్ణ సహకారాన్ని ఈయగలరని వినయపూర్వకంగా అర్థిస్తున్నాము

# తెలుగుభాష—వ్యాకరణ రచనావశ్యకత

డాక్టర్ జి వి సీతాపతి

ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక సం ౪౧—సంచిక 1-3 2-వ పుటలో ప్రకటితమైన "ఆంధ్రవ్యాకరణము" అనే సంపాదకీయ వ్యాసము చదివినాను అందులో కిన్నెర పత్రికయందు ప్రకటితమైన "వాడుకభాష-విశ్వవిద్యాలయములు" అనే వ్యాసమును విమర్శిస్తూ వ్రాసిన వాక్యములున్నవి 'కిన్నెర చిన్నయ సూరిపై ధ్వజమెత్తి'నని ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రికా సంపాదకులు విచారిస్తున్నారు చిన్నయ సూరి గొప్ప పండితుడే కావచ్చును వారు చెప్పినట్లు "పూర్వగ్రంథములనుండి యనేక లక్ష్యముల నొసంగుచు వారిచేతి మీదుగా తెలుగు నిఘంటువునంతయును వ్రాయనేర్చిన పండితాగ్రేసరుడు, పలుమంది పండితులతో నిత్యసంబంధము లభింపగల తెలుగు రాజధానియగు చెన్నపురియందు నివసించిన వారి కావచ్చును కాని అతడు సాధారణముగా మాటలాడుకొంటూ ఉండిన భాష అరవతెలుగుగానే ఉండేదని అతని నెరిగినవారు చెప్పగా నేను 40 ఏండ్లక్రిందట విన్నాను చిన్నయ సూరికి సమకాలికులయిన రావిపాటి గురుమూర్తి శాస్త్రిగారు పురాణం హయగ్రీవశాస్త్రిగారు మొదలయిన పండితుల మాతృభాష శిష్టజనవ్యవహారసిద్ధమైన భాషతెనుగు అందుచేత ఈ పండితులు తమ వాడుకభాషలో రచనలు సాగించడానికి పూనుకొన్నట్లు చిన్నయ సూరి తన వాడుకభాషలో రచన సాగించడానికి పూనుకొనలేకపోయినారు నిత్యమూ తాను మాటాడే అరవతెలుగు విడిచిపెట్టి తెనుగుగడ్డపై నుండిన శిష్టజన వ్యవహారసిద్ధమైన భాషను వ్రాయవలెనంటే అదిన్ని తాను శ్రమపడి నేర్చుకోవలసినదే కాని మాతృభాషవలె వచ్చేది కాదుగనుక తక్కిన పండితులవలెనే తాను అభ్యసించిన ఆంధ్రకావ్య భాషలోనే వచనరచన సాగించుటకు పూనుకొన్నారు ఈవిషయము యథాస్థితి నిరూపించుటకేకాని చిన్నయసూరిని న్యూనతపరచుట నుద్దేశించి వ్రాసినదికాదు. అయితే, చిన్నయ సూరి ఎంత గొప్ప పండితుడయినా ఎంత దొడ్డ ఆశయములు గలవాడయినా అతని బాలవ్యాకరణము, నీతిచంద్రిక ఎట్టి భాషలో రచితములయినవో, ఆ గ్రంథములవలన దేశమునకు ఎట్టి మేలు కలిగినదో విమర్శించవలసి యున్నది

"తెలుగు వ్యాకరణములలో బాలవ్యాకరణమువలె సులభమైనది సమగ్రమైనది మరియొకటిలే"దని పరిషత్పత్రికా సంపాదకుల అభిప్రాయము. "మరియొకటి లే"దనుట వాస్తవమయితే మరింత తేటపడవలసిన విషయము ఎందుచేత ననగా చిన్నయ సూరి రచించిన వ్యాకరణము పేరికి మాత్రము బాలవ్యాకరణమేకాని సులభమైనదీ కాదు సమగ్రమైనదీ కాదు సులభమైనది కాదనడానికి సూచనగా రెండు హేతువులు తెలియచేస్తాను సంస్కృతభాషకు పాణినీయమనుసరించిన పద్ధతిని తెలుగు భాషకు బాలవ్యాకరణము రచించవలెనన్న సంకల్పముతో చిన్నయ సూరి సంస్కృత భాషాలక్షణనిరూపణకు అనుకూలించిన సాంకేతిక పారిభాషిక పదములను తెలుగు భాషాలక్షణ నిరూపణకు ప్రయోగించి తన బాలవ్యాకరణము పెద్దలకయినా సరిగా బోధపడనంత చిక్కుగా రచించినారు లట్టు, లిట్టు ల్పట్టు లాట్టు లుట్టులతోను దుక్కులు ముక్కులు మొదలయిన ఇత్తులతో నున్న ప్రత్యయములతోను విద్యార్థులను బెదరగొట్టే భాషలో రచితమైనది బాలవ్యాకరణము ఇది సులభమైన వ్యాకరణమే అయితే దీనికి గుప్తార్థప్రకాశికవంటి పెక్కు వ్యాఖ్యలు బయలుదేరవలసిన అగత్యమే లేకపోవును. గుప్తార్థ ప్రకాశికనుగూర్చి పీఠికలో శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారు వ్రాసినది చదువుదము గాక:

శ్రీ వేంకటరామ శాస్త్రిగారు చిన్నయసూరి కృత బాలవ్యాకరణము గంభీరార్థ సందర్భము కలదియై సర్వజన సుబోధము కాకుండుటం జేసి దానికి వ్యాఖ్యానము లక్ష్యలక్షణ సమన్వితముగా నతి విపులముగా వ్రాసియున్నారు బాలవ్యాకరణములో ననేక స్థలములం దర్థము గుప్తమైయున్నదనుట నిశ్చయము బాలవ్యాకరణ మర్థము కానివారికిని అందలి సందేహములంగూర్చి చర్చించుచుండువారికి నిది దర్పణమువంటిది " ఈ వ్రాతలను బట్టి బాలవ్యాకరణము సులభమైనదని యెట్లు చెప్పగలము? ఇది సమగ్రమును కాదనడానికి శ్రీమాన్ బహుజనపల్లి సీతారామాచార్యులుగారు రచించిన త్రిలిఙ్గ లక్షణశేషము అను ప్రౌఢ వ్యాకరణమే ప్రబలనిదర్శనము ఈ రెండు వ్యాకరణములును చెప్పక విడిచిపెట్టిన విషయము లెన్నో ఉన్నవి మహాసముద్రమువంటి భాషకు సమగ్రమైన లక్షణమును నిరూపించడము ఏ ఒక్కరికైనా అసాధ్యమైన పని కనుక అందుకు చిన్నయసూరిని ఆక్షేపించుట భావ్యముకాదు కాని చెప్పినదైనా నిర్దుష్టముగా ఉండవలెనుగదా? చిన్నయ సూరి 19-వ శతాబ్దమునాటి పండితుడు 900 సంవత్సరములయి పుట్టిపెరిగియున్న ఆంధ్రవాఙ్మయమున్ను పెక్కు లక్షణ గ్రంథములున్ను ఎదుటనుంచుకొని బాలవ్యాకరణము రచించిన

చిన్నయ సూరి రచించినంతవరకైనా నప్రమాణమైన లక్షణము నిర్దుష్టముగా నిరూపించవలసియుండెను ప్రమాదవశమున గలిగిన పొరపాట్లు సవరించుకోవచ్చును గాని, బుద్ధిపూర్వకముగా మహాకవి ప్రయోగములను గ్రహింపక విడిచిపెట్టి అందుకు విరుద్ధముగా లక్షణమును నిర్వచించినప్పుడు అతని వ్యాకరణము దుష్టముకాక తప్పదు "పూనుపాదవృత్ప కాదికోపం బొకండు వచియించెనది యవిచారమూలకంబు" అని అప్పకవి చెప్పినది నిరాకరిస్తూ చిన్నయ సూరి అనుశాసనము చేసినాడు ఇతని సూత్రమును సీతారామాచార్యులుగారు నిరాకరించి తన శబ్దరత్నాకరములో రెండు రూపములున్ను చేర్చుకొన్నారు వేదము వేంకటరాయశాస్త్రిగారు కూడా తమ నైషధ టీకలో చిన్నయ సూరి మాట తప్పన్నారు అంతకంటె ఎక్కువ తీవ్రముగా గుప్తార్థప్రకాశికా రచయితలు "ఇట్టి లసామాన్య కవి ప్రయోగములుండగా బరిశీలింపక కవిబ్రహ్మ వాక్యమున కెదురాడిన చిన్నయ సూరి వచనంబు చిన్న యసూరి వచనంబుగా తెల్లందగు"నని అధిక్షేపించినారు చిన్నయసూరి వ్యాకరణములో కేవలము నన్నయనాటి భాషకే వర్తించవలసిన సూత్రములున్నవి ఆతర్వాత పెద్దన కాలమువరకును వృద్ధిపొందియుండిన కావ్యభాషకు మాత్రమే వర్తించదగిన సూత్రములున్నవి ఆతర్వాతి అర్వాచీన కవి ప్రయోగములను చేర్చుకొన్న సూత్రములు కూడా ఉన్నవి చిన్నయ సూరి ఏనాటి కావ్యభాషకు తాను వ్యాకరణము వ్రాయదలచెనో చెప్పలేదు. కనుక తనకాలము వరకున్నుగల కావ్యభాషకు వ్యాకరణము వ్రాసియుండునని చెప్పవలసియుంటుంది అప్పుడు కొన్నిసూత్రములు దుష్టములవవలెను లేదా ఆ సూత్రములకు భిన్నముగానున్న మహాకవి ప్రయోగాలు దుష్టములవవలెను "ప్రయోగమూలంవ్యాకరణమ్" అనే సిద్ధాంతమునుబట్టి చిన్నయ సూరి లక్షణము దుష్టమనవలెను గాని మహాకవి ప్రయోగము దుష్టమనరాదుగదా ?

మరియొక సూత్రము ఎట్లున్నదో చూడండి —"కూఁతు శబ్దము ప్రథమైక వచనంబునకు రువర్ణంబగు కూఁతురు-కూఁతులు కూఁతురులు, కూఁతుళ్ల కూఁతురి విత్యాదిరూపంబులు గ్రామ్యంబులని యెఱుంగునది" (చూ ఆచ్చికపరిచ్ఛేదము 9-వ సూ) దీనిని గూర్చి మా తండ్రిగారు వ్రాసినది బాలకవి శరణ్యములో (పుటలు 29-49) పూర్తిగా విమర్శరూపమున ఉన్నది పరిషత్పత్రికా సంపాదకులు చదువుదురుగాక: అది చదివినవారికి చిన్నయసూరి వ్యాకరణము ఎంత సమగ్రమో ఎంత నిర్దుష్టమో బోధపడవచ్చును. అందులో రెండు ముఖ్యవిషయములు ఇక్కడ మనవిచేస్తాను చిన్నయ సూరి వ్యాకరణము వేదవాక్యముగా గ్రహించిన పండితులు ఈసూత్రములను బట్టి కూఁతురులు, కూఁతుండ్రు, కూఁతురికి మొదలయిన రూపము గ్రామ్యములనుకొని మహాకవులు రచించిన ప్రబంధములలో ప్రయుక్తములైయున్నా ఆ గ్రంథములను ముద్రించినప్పుడు ఆ రూపములను కనబడకుండా దిద్ది పాఠములు మారుమారు చేస్తున్నారు, మరికొందరు సూత్రములో "కూఁతు శబ్దము" అని ఉండటంచేత కూఁతు, కూఁతురు అనే రూపములు రెండున్ను ప్రథమైకవచనమున మండవచ్చుననుకొని "నాకొక కూఁతు పుట్టినది" అని ప్రయోగిస్తున్నారు ప్రఖ్యాతాంధ్రకవులయిన శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారు తమ భారతములో "కూఁతు జగదేకకీర్తితయైతలిర్చు నమచు నెల్లరు వినఁబల్కె నశ్రవాణి" (ఆది IX. 19) అనిరి.

"భగవంతుఁ డూర్ధ్వరేతసుఁ

డగు కణ్వవకెట్టి కూఁతువై తివొకదవే" (ఆది V 68) అనిన్ని కూఁతు "శబ్దము" ప్రయోగించినారు నన్నయ ఎట్లు ప్రయోగించినాడో చూడండి—

"ఏవెవ్వరి కూఁతురవు:" (ఆది IV 27) "నేను సంయాతి కూఁతురను" అని కూఁతురు శబ్దము వాడినాడేకాని "కూఁతు" అనలేదు

చిన్నయసూరి సూత్రమునుబట్టి "రాచకూఁతుండ్రు" (భార శాం II 166) అనే తిక్కన సోమయాజి ప్రయోగమే దుష్టము కావలసిన దుస్థితి పట్టినది "కూఁతురులు" "కూఁతురిని", "కూఁతురి" మొదలయిన ప్రయోగాలు అనేక ప్రబంధాలలో కన బడుతున్నవి పండితులు దిద్ది అచ్చువేయిస్తూఉన్నా ఏమరచి దిద్దక విడిచిపెట్టినవి ముద్రితగ్రంథాలలోకూడా కనబడుతున్నవి దిద్దడానికి వీలులేకుండా ప్రాసస్థలంలో "కూఁ। తురిచెలువంపు తేని యొద తుండుడుకెల్లను దీర్చినట్టి యా। కరువలి నట్టి" అని దామెర వేంకటపతి తన బహుళాశ్వ చరితలో ప్రయోగించినాడు (1 8)

తక్కిన రచయితల మాటకేమి చిన్నయ సూరిగారే తాము తెనిగించిన హిందూధర్మశాస్త్రములో "పెండ్లికాని కూఁతుండ్రున్న పక్షమున" (చూ రెండవకూర్పు, పేరా 184 పుట 47) అని వ్రాసినారు

క్రియాపరిచ్ఛేదము 108-వ సూత్రములో "చేతురు కోతురిత్యాదు లసాధువులని యెఱుఁగునది" అని చిన్నయ సూరిగారు శాసనము చేసినారు. కాని నన్నయాది మహాకవులు చాలమంది చేతురు కోతురువంటి రూపాలు తమ రచనలలో ప్రయోగించినారు వ్రాతప్రతులలో తాము చూచినట్లు తిరుపతి వేంకటేశ్వరులవంటి దొడ్డపండితులు కవులు చెప్పినారు కొలిసారి ముద్రితములయిన ప్రతులలో కొన్ని నిలిచియుండెను వావిళ్లవారి ముద్రిత ప్రతిలో నన్నయభారతము సభాపర్వము II. 188 సీసపాదమందు పాఠాంతరము "కురిచినచోటికిఁగొరఁత పేతు" అని ఉన్నది తిక్కన సోమయాజి విరాటపర్వంలో "సంక్షోభింపఁగాఁజేతు" (II. 281) అనిన్ని, కర్ణపర్వములో "దయసేతువుగాక" (1 286, అనిన్ని, సౌప్తికపర్వములో "భూజమల్। సేతురెచేటుసేఁతలు ఫలింపక " (1 88) అనిన్ని ప్రయోగించినట్లు వ్రాతప్రతులనుబట్టి తెలుసుకో

గలము ఇందులో మొదటిది గుప్తార్థప్రకాశికలో ఉదాహృతమైనది రెండవది ఆనందముద్రణములో ఉన్నదిగాని వృట అడుగున "దయచేపెదవు" అనే నిరర్థకమైన పాఠాంతరము కనబరచినారు కూడనది "చేతురు" "వేతురు"గా దిద్ది ముద్రించినారు అర్థము పాడైనా చిన్నయ సూరి సూత్రము పాడుకాకూడదు!

ఇట్టి లోపాలు చిన్నయ సూరి రచించిన బాలవ్యాకరణములో చాలా చూపించవచ్చును ఇక్కడ అవకాశము లేదుగనుక ఏవో రెండు మూడు దిఙ్మాత్రసూచకముగా చూపించడమయినది

"తెలుగుదేశము దేనిని శిరసావహించినదో దానినే విశ్వ విద్యాలయము లాదరించినవి బాలవ్యాకరణమందలి గుణమును గ్రహించియే విశ్వవిద్యాలయము లాదరించినవిగాని చిన్నయ సూరి యధికారమును జూచికాదు" అని పరిషత్పత్రికా సంపాదకులు వ్రాసినారు వీరి మాటలనుబట్టి తెలుఁగుదేశము—అంటే దేశములో చిన్నయ సూరి రచించిన బాలవ్యాకరణము చదువుకొని గుణము గ్రహించినవారు శిరసావహించడముచేత దీనిని విశ్వవిద్యాలయాల వారాదరించినారని విశదమైనది ఆహా! వీరు చెప్పిన "తెలుఁగు దేశము" తెలుగు సాహిత్యాన్ని ఎంత సౌభాగ్యస్థితికి తెచ్చింది!

చిన్నయ సూరి రచించిన బాలవ్యాకరణములో ఎన్నిలోపా లున్నా అతని పరిశ్రమ మెచ్చుకోదగినదే "ఆర్యవ్యవహారంబు లదృష్టగ్రాహ్యంబు, పెద్దలు వ్యవహరించిన మాట గ్రామ్యంబయిన గ్రహింపదగునని తాత్పర్యము " (సంజ్ఞా సూ 28) అని వ్రాసిన చిన్నయ సూరిని నిందించవలసిన పనిలేదు అతనియెడల ఆదరమున్నవారు త్రిలింగలక్షణశేషము రచించిన సీతారామాచార్యులు గారు చేసిన పని చేయవలసియుండెను అంతేకాని అతడు ప్రమాదవశముననో వ్యాకరణ రచనకు కావలసిన కృషిసాగించ దానికి తగిన సౌకర్యములు లేకపోవుటచేతనో కవి ప్రయోగాలను "ఆర్యవ్యవహారమును" అనగా పెద్దలు వ్యవహరించిన మాటలను తెవ్వగా గుర్తింపక రచించిన సూత్రములు దుష్టములని గ్రహింపక అతని దుష్టసూత్రములను బట్టి మహాకవి ప్రయోగాలను దిద్దిన పరిష్కర్తలను "సాక్ష్యమును తప్పవచ్చిన" నేరమునకు దండించ వలసియుండెను తెలుగుదేశభాష తెలుగువారి నాలుకలపై నిత్యమూ తాండవిస్తూ ఉన్న భాష ఇట్టి భాషకు వ్యాకరణము రచించేవారు సర్వజనసమ్మతములైన మూడు సూత్రాల నాధారముగా పెట్టుకొని భాషాలక్షణాన్ని నిరూపించవలెను 1 నిత్యప్రవాహినీ దేశ్యా, 2 సిద్ధిర్లోకాద్వ్యక్త్యా, 3 ప్రయోగమూలం వ్యాకరణమ్ దేశభాష మారుతూ ఉంటుందనిన్నీ ఎప్పటికప్పుడు శబ్దసిద్ధి లోకమందలి పెద్దల వ్యవహారమునుబట్టి తెలుసుకోవలసి ఉంటుంది అనిన్నీ ప్రయోగములనుబట్టి వ్యాకరణము రచించవలసి ఉంటుందనిన్ని మనము తెలిసికోవలసియున్నది.

ఇక చిన్నయసూరి రచించిన నీతిచంద్రికవలన "తెలుఁగు దేశము"నకు ఎట్టి మేలుకలిగినదో చూతండి ఆంధ్ర శబ్దచింతా మణి మొదలుకొని చిన్నయ సూరి వరకున్ను గల వ్యాకరణాలన్నీ పద్యకావ్యములను ఆధారంగా పెట్టుకొని రచితములయినవేకాని చిన్నయ సూరి నాటికే వందలకొలదిగా నుండిన గద్యరచనలను పాటించినవికావు ఎన్నెన్నివిధముల గద్యరచనలు చిన్నయ సూరికి పూర్వమే వెలసియుండెనో మా తండ్రిగారు ప్రకటించిన గద్య చింతామణి అనే గ్రంథముచూస్తే బోధపడుతుంది అప్పకవివంటి లాక్షణికుడుకూడా తనగ్రంథములో తెలినిది మొదలయిన వచన రచనలన్నీ తన వ్యావహారిక భాషలోనే రచించినాడు కావ్యభాషా జ్ఞానం గల పండితులుకూడా వ్యావహారిక భాషలోనే వేదాంత విషయాలు శాస్త్రవిషయాలు వసుచరిత్ర మొదలయిన ప్రబంధా లకు వ్యాఖ్యలు వ్యాకరణ వివరణములు మొదలయిన వచన గ్రంథాలు రచించినారు వీటితోపాటు సాహిత్యకళాధర్మముగల రచ నలుకూడా వ్యావహారిక భాషలోనే సాగిందారు చెన్నపట్టణమందు గవర్నమెంటు పాఠశాలలో ప్రధానాంధ్రోపాధ్యాయులుగా నుండిన పండితులు రావిపాటి గురుమూర్తిశాస్త్రిగారు వ్యావహారిక భాషలో 1819 సం॥న విక్రమార్క చరిత్రమున్ను, 1834 సం॥న పంచ తంత్రమున్ను రచించినారు ఈ గ్రంథములున్ను 1836 సం॥న వారు వ్యావహారిక భాషలోనే రచించిన తెలుగువ్యాకరణమున్ను బడులలో పాఠ్యగ్రంథములుగా ఉండేవి దీనినిబట్టి చూడగా చిన్నయ సూరి కాలమువరకున్ను "గ్రాంథికభాష" అనేది కేవలము పద్యకావ్యరచనకే ఉపచరిస్తూ ఉండేది అనిన్ని, వచనరచనల కన్నింటికిని వ్యావహారికభాషే ప్రయుక్తమగుతూ ఉండేదనిన్ని విశదము కాగలదు ఈ సంప్రదాయమునకు విరుద్ధముగా చిన్నయ సూరిగారు పద్యకావ్యరచనకే ఉపయుక్తమగుతూ ఉండిన కావ్య భాషలో తమ నీతిచంద్రిక రచించారు అదైనా సులభశైలిలోగాక ప్రబంధాలలో శబ్దాలంకారాలతో నుండే గద్యశైలిని శబ్దాడంబర ముతో రచించారు దీనిని బడులలో పాఠ్యగ్రంథముగా పెట్టడం చేత చిన్నయ సూరి బాలవ్యాకరణమున్ను నీతిచంద్రికయున్ను చదువుకొని ఆనందించిన "తెలుఁగుదేశము" వారికి శబ్దాడంబరము గల వచనరచనయెడల వ్యామోహ మెక్కువయినది కొందరు అతని రచన ననుకరిస్తూ వచనరచన సాగించారు వీరేశలింగము పంతులుగారుకూడా చిన్నయసూరిగారు పెట్టిన నడువడినే విగ్రహ తంత్రము రచించారు అయితే పంతులుగారు వివేకముగలవారు గనుక ఇట్టి రచనలవలన ప్రయోజన మేమీలేదని గ్రహించి సులభ శైలిలో సంధితంత్రమున్ను అంతకంటెను ఎక్కువ సులభశైలిలో తక్కిన వచనరచనలున్ను సాగించారు "లాక్షణికభాష నంగీక రించిన" "లాక్షణికభాషలోనే" వ్రాసిన కందుకూరి వీరేశలింగము గారిని" వాడుకభాషలో గ్రంథములు వ్రాసి తత్ప్రచారమునకై

ఉద్యమకర్తలైన గిడుగు రామమూర్తి, గురజాడ అప్పారావుగార్లతో కలిసి "వ్యావహారికభాషాపోషకులుగా" కిన్నెరవారు ప్రశంసించినందుకు దీనివలన వీరి కేమి లాభమో తెలియుటలేదు" అని పరిషత్పత్త్రికా సంపాదకులు వ్రాసినారు అందుకు సమాధానమేమంటే ముగ్గురమూ లాక్షణికభాష నంగీకరించుటలోను లాక్షణికభాషలో రచన సాగించవలెనన్న సంకల్పములోను సమాన ధర్మము గలవారే చిన్నయ సూరి రచించిన బాలవ్యాకరణముగాని, వీరితంద్రికగాని అనుసరించదగినవికావన్న అభిప్రాయంతోనే వీరేశలింగంగారు సంగ్రహవ్యాకరణము రచించారు, సులభశైలిలో వచనరచన సాగించారు ప్రహసనాలు కావ్యభాషలో రచించినమొదల అందలి ప్రసంగాలు ఎంత అసహజముగాను, అసంగతముగాను ఉంటవో గ్రహించినవారు గనుకనే పంతులుగారు పాత్రోచితమైన వ్యావహారికభాషలో రచించారు ఈ భాష మొదల వారికి పూర్తిగా ఆదరముండబట్టే పాత్రోచితముగా దీనిని సాగించారు లాక్షణికభాష అంటే చిన్నయసూరిగారు బాలవ్యాకరణమున నిర్వచించినదిమాత్రమే కాదని గ్రహించి తమకాలమువరకున్న పరిణమిస్తూవచ్చిన వాఙ్మయాన్ని గుర్తించి చిన్నయసూరి నిరాకరించిన ప్రయోగాలను చేస్తూవచ్చారు మా తండ్రిగారి వ్యావహారిక భాషావాదాన్ని ఆమోదించి భాషాలక్షణాన్ని నిరూపించడానికి పూనుకొన్నారు ఈ విషయము వారి స్వీయచరిత్రలో ఉన్నది పరిషత్పత్త్రికాసంపాదకులు చూతురుగాక! తాము సంకల్పించినరీతిని వ్యాకరణము రచించుటకు వారు ప్రారంభించినారుగాని మృత్యువాసన్నమగుటచేత పని సాగలేదు

"నేఁడు వ్యాకరణము రచింపవలెనన్న వారు వ్రాయఁగలఁగుట సమంజసముగాదు" అని పరిషత్పత్త్రికాసంపాదకులు వ్రాయుట సమంజసముగా నున్నది చిన్నయసూరిగారి వ్యాకరణ "పోకడ" వ్రాసినారు గనుకనే అది అసమగ్రమున్నూ, కొన్నిచోట్ల దుష్టమున్నూ అయినది "ఈనాటికైనను వ్యావహారికవాదులు వ్యాకరణావశ్యకతను గ్రహించుట యాంధ్రభాషకు శుభావహము" అని పరిషత్పత్త్రికా సంపాదకులు అన్నట్లే "తెలుఁగుభాషకు సజాతీయేతర భాషలతోఁ గల సాదృశ్యములను సాకల్యముగా నిరూపించుచు నొక వ్యాకరణము రచించి ప్రచురించుట ప్రధానమైన మా పరిషదుద్దేశ్యములలో నొకటి" యని వ్రాసినారు గనుక ఈనాటికైనను తమ ఉద్దేశ్యమును నెరవేర్చుకొనవలసిన ఆవశ్యకతను గ్రహించుట యాంధ్రభాషకు శుభావహమని కిన్నెరవారి తరఫున నా తరఫున మనవిచేస్తున్నాను. "సర్వజనసమ్మతమై సర్వాంధ్రదేశమునకు వ్యవహారయోగ్యమైన వ్యాకరణము వ్రాయుట ప్రశస్తముగా నుండు"నని పరిషత్పత్త్రికా సంపాదకులు తెలియజేసిన ఆశయముతో నేను పూర్తిగా ఏకీభవిస్తున్నాను వ్యాకరణరచనకు నే నొక్కఁడనే పూనుకొనలేదు ప్రాచీన సంప్రదాయానుసారులైన సుప్రసిద్ధులగు పండితులను భాషాశాస్త్రసంప్రదాయవిదులను గలిసికొని వారి సహకారముతోనే పలువురి పేరితోనే వ్యాకరణరచన సాగించవలెనని నా సంకల్పము అందుకొరకు సర్వజన సమావేశము జరిపించవలెననికూడా కిన్నెరవారు ఆలోచిస్తున్నారు అందరును ఏకముఖముగా పనిచేసి ఈ కార్యము నెరవేర్తురుగాక! అని మనవిచేస్తున్నాను


సౌభాగ్య

గాంధీజీ నిర్మాణ కార్యక్రమంలో ఒక అంశమైన మహిళాభ్యుదయాన్ని సాధించే ఉద్దేశంతో భారతదేశంలో ఓం ప్రథమంగా మదరాసు ప్రభుత్వం స్త్రీ జనాభ్యుదయశాఖను స్థాపించింది

స్త్రీల విజ్ఞాన వికాసాలకు దోహద మిచ్చే రచనలతో "సౌభాగ్య" అనే సచిత్ర మాసపత్రిక ప్రచురింపబడుతున్నది సాంఘిక సంక్షేమం "సౌభాగ్య" ఆశయం

అందరికీ అందుబాటులో ఉండేటట్లు విడిప్రతి వెల 3 అణాలు, సాలు చందా (పోస్టేజీతో సహా) రెండు రూపాయలు ఏర్పాటు చేయబడింది

"సౌభాగ్య" ప్రతులకు స్త్రీ జనాభ్యుదయశాఖను గురించిన ఇతర వివరాలకు ఈ క్రింది చిరునామాకు వ్రాయండి

ఎడిటర్: "సౌభాగ్య"

7, ఆరాముదు గార్డెన్ స్ట్రీట్, ఎగ్మూరు, మద్రాసు—8

# భాషోత్పత్తి

ధూపటి లక్ష్మీనారాయణరావు

మానవునకు ప్రాణిప్రపంచమునం దేర్పడిన ఉన్నతస్థానమునకు అతని భాషణసామర్థ్యమే హేతువు. జన్మతః అతనికి సిద్ధించిన శక్తు లన్నిటియందును భాషాశక్తి విలక్షణము. విశిష్టగుణసంపన్నమైనది. భాషాసాహాయ్యమున మానవుడు దేశకాలబాధలను అవలీలగూడ అధిగమించగలుగుచున్నాడు. బాహ్యేంద్రియగోచరమగు వస్తుప్రపంచమునకు అవధిగలదు. మన ఇంద్రియసామర్థ్యముకూడ పరిమితికి లోనైనదియే. అతిసూక్ష్మపదార్థములు నయనగ్రాహ్యములు కావనుట అనుభవసిద్ధమగు విషయము. ప్రకృతియందలి రంగులలోకూడ కొన్నిమాత్రమే చక్షుర్గ్రాహ్యము లగుచున్నవి. అట్లే ధ్వనులలో (Sounds) కూడ ఒక అవధియందలివి మాత్రమే మనము వినగలుగుచున్నాము. ధ్వనితరంగముల పరిమాణము ననుసరించి యీ గ్రాహకత్వపరిమితి శ్రవణేంద్రియమునకు ఏర్పడినది. ఈవిధముగ, మన బాహ్యేంద్రియసాధనములకు గల సామర్థ్యము పరిమితమైనది అని శాస్త్రపరిశోధనఫలితముగ తెలియవచ్చినది. ఇంద్రియగోచరములు కాని యీ అతిసూక్ష్మములగు వస్తువుల పరిశీలనకై సాధనముల నిర్మాణము అవసరమైనది. ఈ సాధనములైనను భౌతికప్రపంచమందలి సూక్ష్మతమ పదార్థములను గోచరింపచేయగలవేకాని అవ్యక్తములు అమూర్తములు నగు విషయములను కాదు. అతీంద్రియములగు ప్రకృతిరహస్యములు భౌతికసాధనములచే గ్రాహ్యములుకావు. ప్రత్యక్షగోచరములు కానట్టి ప్రకృతిసిద్ధములగు విషయము లనేకములు అనుమానప్రమాణము (Inference) చేతనే గ్రాహ్యము లగుచున్నవి. గ్రహములదూరము, సూర్యచంద్రగ్రహముల కాంతి ప్రసారాదులు మున్నగు విషయములకు సంబంధించిన జ్ఞానమంతయు మనకు మననచింతనాది మానసికవ్యాపారమువల్ల పరోక్షమార్గమున లభింపవలసినదేకాని ప్రత్యక్షమార్గమున కాదు. గ్రహనక్షత్రాది ప్రకృతిసిద్ధములగు వాస్తవిక విషయపరిజ్ఞానమునకు గూడ మానసికవ్యాపార మవసరమగుచుండగా అతీంద్రియములు బుద్ధిగ్రాహ్యములు నగు జీవితతత్త్వాది విషయపరిజ్ఞానమునకు మనస్సే పరమసాధనమనుటలో సందేహములేదు.

ఇట్టి అతీంద్రియవిషయముల గూర్చిన ఆలోచనయంతకును భావసంపత్తియే సాధనము. వస్తువులను సాధనములుగా జేసికొని కరచరణాద్యవయవముల సాహాయ్యమున మనము నూతన వస్తుసృష్టిని కల్పనలను గావించినట్లు మనస్సు భావములను సాధనములుగా జేసికొని బుద్ధిసాహాయ్యమున నూతనసృష్టిని గావించుచున్నది. ప్రకృతిరహస్యము లీమార్గముననే మనస్సు గ్రహింపగలుగుచున్నది. మానసికవ్యాపారమునందు సాధనములగు భావములు అమూర్తములైనవి (Abstract). మానసికముగ వీనికొక రూపకల్పన గావించి ఆ రూపములను (Mental Pictures) జ్ఞప్తియం దుంచుకొని ఆయాసందర్భములం దాలోచన సాగించుటకు సాధ్యము కాదు. అనగా ప్రత్యేకభావములకు ప్రత్యేకములగు చిత్రరూపములను (Pictorial forms) మనస్సున నేర్పరచుకొని ఆ రూపముల సాహాయ్యమున ఆలోచన సాగించుట కష్టమని అర్థము. శక్తి, వేగము, ఉష్ణము, దయ, క్రౌర్యము, బుద్ధి, మనస్సు, ఆత్మ—ఇత్యాది భావములకు రూపకల్పన కావించుటయు సాధ్యముకాదు. ఒకవేళ సాంకేతికచిత్రరూపకల్పన సాధ్యమేయైనను ఆలోచనాసందర్భములలో నవి యొకటివెంబడి యొకటిగా చలనచిత్రప్రదర్శనమునందువలె మనోనయనమునెదుట ప్రత్యక్షము కావలసియుండును. అట్లు ప్రత్యక్షముచేయు పనికూడ మనస్సునకు చెందినదే యగుటచే క్లేశమెక్కువయై ప్రధానమగు యోచనకు అంతరాయము కలుగును. ఐన ఈ మానసికచిత్రరూపములు సంస్కారముగ నేర్పడి ఆలోచనాసందర్భములం దప్రయత్నముగనే ఉద్బోధములు కాగూడదా? భావములకు చిహ్నములగు ధ్వనిరూపముల విషయమునం దట్టి ప్రవృత్తియే జరుగుచుండుటలేదా? అని ప్రశ్నింపవచ్చును. కాని ఇందొక విషయమును గమనింపవలసియున్నది. నయనశ్రవణాది పంచేంద్రియములును గ్రాహకేంద్రియములే యగుటచే వానికి కల్పనాశక్తి లేదు. వాగింద్రియములచే వ్యక్తమగు ధ్వనిని శ్రవణము గ్రహింపగా, ధ్వనిచే బోధ్యమగు నర్థమును బుద్ధిసంస్కారముల సాహాయ్యముచే మనస్సు గ్రహించుచున్నది. భావచిత్రరూపముల విషయమునందలి విధానము వేరు. భావములకు ప్రతిరూపకములుగా చిత్రరూపములు నేర్పరచుట, ఆలోచనాసందర్భమున వానిని ప్రత్యక్షీకరించుట మరల వానిని తానే గ్రహించుట—అను కర్మలన్నియు మనస్సే చేయవలసియుండును. కావున ఈ విషయమున మనస్సునకు క్లేశమెక్కువ. ధ్వనిచిహ్నముల విష

యము వేరు భావములకు మొదట ధ్వనిసంజ్ఞల నేర్పరచుటయందు మాత్రమే మనస్సునకు ప్రవృత్తి. ఆ సంజ్ఞల సంస్కారరూపము సిద్ధించినపిమ్మట ఆలోచనాసందర్భమున వాగింద్రియములు స్వయముగ ప్రవర్తించి యామాధ్యమములను వ్యక్తపరుపగలుగుచున్నవి. ఇందువలన మనస్సునకు స్వేచ్ఛయెక్కువయై క్లేశము తగ్గి ఆలోచన సులభమగుచున్నది. మానవప్రకృతి యట్టి సులభమార్గము నవలంబించినది. జీవితప్రవృత్తియే ఇట్టిది. కనుక మానసికములగు చిత్రరూపములకంటెను ధ్వనిరూపములకే ఎక్కువ ప్రవృత్తి యేర్పడినది. మొదట భావములే అమూర్తవిషయములు. వానికి ప్రతిరూపకములగు చిత్రరూపములుకూడ అమూర్తవిషయములు. భావముల సంఖ్యకును పరిధిలేదు. అట్టిచో అసంఖ్యాకములగు అమూర్తభావములకు ప్రతినిధులగా మానసికచిత్రరూపములను కల్పించుకొని వానిచే చింతనవ్యాపారమును సాగించుట అతిక్లేశమగు పని. కావున అమూర్తములగు భావములకు ఇంద్రియగ్రాహ్యములగు రూపము లేర్పడినచో మననచింతనాది మానసిక ప్రవృత్తి సుకరమగును. ధ్వనిచిహ్నములచే (Sound symbols) అట్టి సౌకర్యము కలిగినది. చింతనాది మనోవ్యాపారములకు మానవు డలవడు ప్రాథమికదశయందు ఈ ధ్వనిచిహ్నలు శ్రవణేంద్రియగోచరములగుట అవసరము. చిన్నపిల్లలు లెక్కలుచేయునప్పుడును చదివిన విషయమును మననము చేయునప్పుడును పైకి వినబడునట్లు పలుకుట గమనింపవచ్చును. ధ్వనిచిహ్నల సంస్కారము మనోజీవితమున స్థిరపడుట ఆలోచనావ్యాపారమునకు వ్యక్తత అలవడుట —జరుగుకొలది పైకి చదువు నలవాటు క్రమముగ క్షీణమగుచున్నది. మౌనపఠనమునకూడ ఆయాశబ్దముల యుచ్చారణకు వలయు వాగింద్రియప్రయత్నాదులన్నియు జరుగుచునేయుండును. కాని నాదము నభివ్యక్తముచేయు నాంతరవాయువతిదుర్బలమగుటచే శబ్దము శ్రవణగోచరమగుట లేదు. క్రమాభ్యాసశిక్షణముగల తత్త్వజ్ఞులయందును పండితులయందును ఈ చింతనాప్రవృత్తి భావనావ్యాపారము వాగింద్రియముల సహాయము లేకనే నడచుచున్నది. పరిపూర్ణ ధ్వన్యాత్మకమగుభాష విశిష్టసంస్కారరూపమున స్థిరపడినపిదప భావమును తద్ద్యోతకచిహ్నమును నభిన్నముగ భావించు పరిణతస్థితి ఇది. మానవమనస్తత్త్వము వివిధాంతరంగిక ప్రవృత్తులు సంస్కృతి తత్త్వము—ఇత్యాది అతిక్లిష్టములగు అతీంద్రియవిషయములనుగూర్చి చాల సులువుగ ప్రత్యక్షవస్తువుల నింద్రియములతో పరీక్షించినట్లు పారిభాషికశబ్దముల సాహాయ్యమున విమర్శించుటకు ఇట్టి భాషాసంస్కార మావశ్యకమగుచున్నది. ఆలోచనీయమగు విషయము చాల పెద్దదియై అనేకములగు అవాంతరవిషయములతోను పూర్వపక్షసిద్ధాంతములతోను కూడినదైనచో మనస్సు అట్టివిషయమును ఆదినుండి తుదివరకును గ్రహించియుండుటలో మిక్కిలి క్లేశము ననుభవించవలసియుండును. కనుక విమర్శవిషయము అతిక్లిష్టము, విస్తృతమునైనచో మనస్సు స్వయముగ తానొక్కటియే ఆ కార్యమును నిర్వహింపలేకపోవును. కనుక భావములను ద్యోతకముచేయు క్షణికములగు ధ్వనిచిహ్నలకు ప్రతిరూపకములుగ బాహ్యేంద్రియగోచరములు స్థిరములు నగు రేఖాచిహ్నము లేర్పడునవసరము కలిగినది. వ్రాతయేర్పడుట కిదియొక ముఖ్యకారణము. మనస్సునందుద్బుద్ధములైన భావపరంపరలు అమూర్తములైనవి యగుటచే అవి మనోనయనమునెదుట స్థిరముగ నిలిచియుండవు. తద్ద్యోతకములగు ధ్వనిచిహ్నములుకూడ ధ్వనిస్వభావమునుబట్టి ఉచ్చరితములైనవెంటనే నశించునవగుటచే నవియు మనోవీధియందు స్థిరముగ నుండవు. కనుక మనస్సునకు క్లేశము కలుగుచున్నది. జ్యోతిఃశాస్త్రమును గురించికాని పరమాణుతత్త్వశాస్త్రమును గురించికాని ప్రపంచించుటలో రేఖారూపమగుభాష (లిపి) ఎట్లు తప్పనిసరియగుచున్నదో తెలిసినవిషయమే. పూర్వాపూర్వములగు భావములను తద్విమర్శలను మరలమరల స్మరణకుతెచ్చుకొనవలసిన యవసరము చింతనయందేర్పడుచుండుటచే మనస్సునకు శ్రమకలుగుచున్నది. నయనేంద్రియ గోచరములు స్థిరములు నగు రేఖాచిహ్నములు ఈ శ్రమను తగ్గించుచున్నవి. పూర్వభావములను రేఖారూపమున మరల పునరావృత్తములుగ జేసికొనుటకును వానియాధారమున హేతుబద్ధముగ నాలోచించి సిద్ధాంతముల నొనర్చుటకును ఈవిధమైన సౌలభ్యమేర్పడినది. ఇట్టి భాషాసాధనములేనిచో విజ్ఞానము సంస్కృతి ఇత్యాదులెవ్వియు సిద్ధించియుండవు. కావున భాషయే మానవుని వైశిష్ట్యమునకంతకును మూలకందమగుచున్నది.

ఐన ఈ భాషణసామర్థ్యము మానవున కెప్పుడు ఎట్లు సిద్ధించినది అను ప్రశ్నకు తృప్తికరమగు సమాధానము దుర్లభము. మానవత్వప్రధానలక్షణములగు మేధస్సు బుద్ధి స్మృతి—మున్నగు వాని యుత్పత్తివిషయమున నెట్లు ఇదమిత్థమని యొకనిర్ణయము సాధ్యముకాదో అట్లే మానవత్వవిశిష్టలక్షణమగు భాషోత్పత్తివిషయమునకూడ నిర్ణయము సాధ్యముకాదు. ఏయాధారములునులేని యీవిషయమున ప్రతిపాదితములైన సిద్ధాంతములన్నియు చాలవరకు నూహాజన్యములే యనుట నిస్సంశయము. ఐనను ఈ సిద్ధాంతములయందుకూడ పాక్షికమగు సత్యమును కొంత లేకపోలేదు. ఈ క్రింద వివరింపబడిన ప్రధానములగు నీ వాదములనుగమనించినచో నిందలిసత్యము విదితముకాగలదు.

<u>ఈశ్వర సంకల్పము</u> —భాష ఈశ్వరతత్త్వమనియు కనుక నది అపౌరుషేయమనియు మన ప్రాచీనుల అభిప్రాయము. స్వయంభువగు నీశ్వరుడే వాక్కును సృజించెనని వీరి భావము. "దేవీం వాచమజనయంత దేవాః తాం విశ్వరూపాః పశవో వదన్తి" అని

ఋగ్వేదమున దివ్యమగువాక్కు దేవతాసృష్టి యని వర్ణితమై యున్నది

"న మనసా వాచం మిథునం సమభవత్" అనియు

వాగ్వై సమ్రాట్ పరమం బ్రహ్మ" అనియు నుపనిషత్తులలో వాక్కు బ్రహ్మతత్త్వమనియు స్వయంభువగు పరబ్రహ్మహృదయమునుండి నిర్గమించినదనియు వర్ణితమైయున్నది

పాశ్చాత్యదేశములలోకూడ ప్రాచీనకాలమునందు ఈ యభిప్రాయమే వ్యాప్తియందుండినది క్రైస్తవుల మతగ్రంథములలో (Old Testament) భాష దైవకల్పితమనియే కలదు సృష్టి పూర్తియైనవెంటనే భగవంతుడు ప్రాణులన్నిటిని ఒకటొకటిగా మానవుని యొద్దకు గొంపోవ మానవుడు వానికాయా నామముల నొసంగెనని ఈవిషయమే కథారూపమున తెలుపబడియున్నది బుద్ధికి అగమ్యములగు విషయములను దివ్యములనియు ఈశ్వరేచ్ఛాకల్పితములనియు వర్ణించుట మన స్వభావము కనుక ఈ వాదము కొంతవరకు సమంజసమేయగును కాని భాష ఈశ్వరకల్పితమేయైనచో అన్నిదేశములందును నాయా వస్తువులయొక్కయు ప్రాణులయొక్కయు వాచకములు అభిన్నములుగ నుండవలెనుకదా యను ప్రశ్న యుదయించుచున్నది ఒకదేశమున "క్యాట్" అనియు మరియొకదేశమున "పిల్లి" యనియు నింకొక ప్రాంతమున మార్జాలమనియు నొకజాతిప్రాణికే భిన్నవాచకము లేర్పడుట యెట్లు? ఈ ప్రశ్నలకు సమాధానముగా ఆదియందు భాష ఒకరూపముతోనే సిద్ధించెననియు తరువాతికాలమున ప్రకృతిపరిణామము ననుసరించి భిన్నస్వరూపములను దాల్చినదనియు చెప్పవచ్చును ఐనచో భూమియందు ఏదో యొకప్రాంతమునందుమాత్రమే మానవజాతి యొకకాలమున సృష్టికి వచ్చెననికాని లేదా అన్నిప్రాంతములందును నేకకాలమున సృష్టికివచ్చెననికాని అంగీకరింపవలసియుండును కాని ప్రపంచమునందలి జాతుల భిన్న నాగరకతా సంస్కృతులనుబట్టి చూచినచో ఈవాదములకు అవకాశము లభింపదు భిన్నభాషలందలి శబ్దార్థవైవిధ్యమును సమన్వయపరుప వీలులేదు భాషణసామర్థ్యము మానవున కీశ్వరదత్తమనియు నది మానవునకు సహజాతమనియు నంగీకరింపవచ్చును కాని శబ్దార్థములకు సిద్ధించిన సంబంధ మీశ్వరకల్పితమని చెప్పుటకు సాహసింపజాలము నూతనభావములు సంఘమున నేర్పడుటయు వానిని ద్యోతకము చేయుటకై నూతన శబ్దములు సృష్టికివచ్చుటయు అనుభవసిద్ధములే అనేకములగు శబ్దములు వ్యవహారమున లోపించుట కూడ జరిగినది శబ్దస్వరూపమున మాత్రమేకాక అర్థమునను మార్పులుకలిగినవి కావున భాష ఈశ్వరకల్పితము అను వాదము హేతువాదమునకు విరుద్ధము

ఇదికాక వేదకాలమున ఋషులుకూడ శబ్దములనేకములను కల్పించినారని వేదములవల్లనే తెలియుచున్నది

(ఎ) "బ్రాహ్మణాసః సోమినః వాచమక్రమిత"

(బి) "వసిష్ఠాసః పితృవత్ వాచమక్రమత" అను వాక్యములవలన సోమపీథులగు బ్రాహ్మణులును వసిష్ఠులును కొన్ని శబ్దముల నాయాసందర్భములందు కల్పించియుందురని విదితమగుచున్నది "పితృవత్" అను ప్రయోగముచే వసిష్ఠవంశమువారి పూర్వులుకూడ శబ్దకల్పనకు కారకులైరని వ్యక్తము సంఘజీవితపురోభివృద్ధిననుసరించియు యజ్ఞకర్మల విస్తృతినిబట్టియు నూతన శబ్దజాలమున కవసరమేర్పడుటయు నాయాకాలమందలి విద్వాంసులు నూతనశబ్దములను కల్పించుటయు జరిగియుండును పరిభాషాపదజాలమంతయు నేడును ఈవిధముననే ఏర్పడుచున్నది

నైయాయికులును వైశేషికులును భాష ఈశ్వరసృష్టయను వాదము నంగీకరింపరు భాష మానవకల్పితమని వీరి అభిప్రాయము వాగింద్రియముల సాహాయ్యమున శబ్దోత్పత్తి జరుగుటయు అట్లుత్పన్నమైన ధ్వనులు వెంటనే నశించుటయు ఇంద్రియగోచరములగు ప్రత్యక్షవిషయములు ప్రపంచమందలి వాచ్యములగు వస్తువులవలెనే వాచకశబ్దములుకూడ ఉత్పత్తినాశము లనెడి రెండు లక్షణములను కలవి యగుటచే శబ్దమూలమగు భాష నిత్యము కాదని నైయాయికుల మతము ద్రవ్య గుణ క్రియలలో శబ్ద మేదియును కాదనియు దానికి నిత్యత్వము లేదనియు వీరు వివరించినారు ఇదికాక ప్రపంచమున భాష లనేకము లుండుటయు ఏ రెండు భాషలును సంపూర్ణముగ నభిన్నములు కాకుండుటయు కారణములుగ భాష నిత్యము ఈశ్వరసృష్టి అని అంగీకరించుటకు వీలులేదు శబ్దార్థసంబంధము ఈశ్వరకల్పితముకాదని వీరి మతమైనను వీరు పూర్తిగ ఈశ్వరసృష్టి వాదమును నిరసింపలేదు వాచ్యార్థమునకు మూలమగు శక్తి (అభిధాశక్తి) సాంకేతికము కాదనియు అది ఈశ్వరేచ్ఛాకల్పితమనియు నైయాయికవైశేషికులు అంగీకరించినారు

"సామాయికః శబ్దాదర్థసంప్రత్యయో న స్వాభావికః"

అని వీరు శబ్దార్థములకు స్వాభావికసంబంధము లేదనియున్నను వాచ్యార్థమువిషయమున మాత్రము సహజసంబంధము నంగీకరించియుండుట గమనింపదగిన విషయము ప్లేటో అరిస్టోటలు లిరువురును శబ్దార్థములసంబంధము పూర్తిగ కల్పితమేయనియు స్వాభావికము కాదనియు నభిప్రాయపడియున్నారు అనగా వీరిమతమున వాచ్యార్థముకూడ కల్పితమేయని భావము ఒక శబ్దమే భిన్నభాషలందు భిన్నార్థములతో నుండుటకూడ నైయాయికుల మతమునకు పోషకమగుచున్నది "పాప" అను శబ్దమునకు తెనుగు కన్నడము

లో "చిన్నబిడ్డ" అని అర్థమైయుండ సంస్కృతమందు దానికి దోషము. పీత క్రౌర్యార్థములు గలవు "పిల్" అను ధాతువు నకు సంస్కృతమున "ఆపు" "అడ్డుపెట్టు" అని యర్థమైయుండ ఆంగ్లమున నదే ధాతువునకే "పై కొక్కను తీసివేయు" అని యర్థము ఇట్టియెన్నియేని యుదాహరణములీయవచ్చును శబ్దము మాకా శముయొక్క గుణమనియు నీ ఆకాశముయొక్క సంచలనము ధ్వని యుత్పత్తికి కారణమనియు తెలిపి నైయాయికవైశేషికులు "వీచీతరంగన్యాయము"ను ప్రతిపాదించినారు

"వీచీతరంగన్యాయేన తదుత్పత్తిస్తు కీర్తితా"

వస్తువుయొక్క సంచలనము కారణముగా వాయుసంచలనము కలిగి, తరంగమార్గమున శక్తిప్రసారము జరుగుటలో ధ్వని యుత్పన్నమగుచున్నదనుట ప్రకృతిసిద్ధమగు విషయము వాయు తరంగము లట్లు ధ్వనియుత్పత్తిప్రసారములకు కారణములగుచున్న వని నైయాయికులు సూచించియుండుట గమనింపదగినది

పదునెనిమిదవ శతాబ్దముపందుండి Herder అను భాషా శాస్త్రజ్ఞుడుకూడ భాష ఈశ్వరసృష్టి యను వాదమును ఖండించి నాడు ఈవిషయము నతడు చర్చించుచు భాష దైవసృష్టియే యైనచో నది యిపుడున్నట్లు క్రమరహితమైయుండదనియు వింత కంటె సమగ్రము సక్రమము నైయుండెడిదనియు బలికినాడు [దైవసృష్టియగు నితరప్రకృతిమాత్రము సక్రమమై యున్నదా? క్రమబద్ధముచే బోధ్యమగు నర్థము మనము గ్రహింపకొన్నది ఈశ్వ రునిదృష్టికో నేది క్రమమో ఏది కాదో మనకెట్లు తెలియును?] భాష ఈశ్వరుని సృష్టికాదని Herder పలికినను నది మానవకల్పిత మనికూడ నంగీకరింపడు భాష ప్రయత్నపూర్వకమగు మానవ కల్పన కాదనియు జీవితమునందలి అవసరముల ననుసరించి ఆంతరంగికమగు ప్రేరణచే భాష యేర్పడియుండునవియు నతని అభిప్రాయము బీజమునందలి ప్రాణశక్తి అనుకూలపరిస్థితులలో వికసించి అంకురముగ పైకి విచ్చుకొనునట్లు గర్భస్థపిండము పరి ణతమై శిశురూపమున నవతరించునట్లు స్వాభావికముగనే హృద యస్థభావము వాగ్రూపమున వ్యక్తమగుచున్నదని Herder భావము ఇతర జంతువులవలెనే మానవుడును తన హృదయభావములను కంఠస్వనములచే వెలిబుచ్చుచున్నాడు కాని యీ ఆవేశజన్యములగు స్వనములనుండి భాషోత్పత్తిని నిరూపించుటకు సాధ్యముకాదు, ఇతర జంతువులకంటెను మానవుడు భిన్నుడైయుండుట రూప శక్తి సామర్థ్యములయందు మాత్రమే కాదు అనిర్వాచ్యమగు నొకానొక విశిష్టత మానవునియందు సహజమైయున్నది ధ్యాన, ధారణ శ్రద్ధాదులా విశిష్టతయందలి యంశములు అవిభాజ్యమగు నతని మనస్తత్వమొక ప్రధానాంశము బాహ్యేంద్రియగోచరము లగు వస్తువుల గుణములలో ప్రధానమైనవి శ్రద్ధాధారణలకు గురియై

అతనిచే గ్రహింపబడుచున్నవి అందు మిక్కిలి ప్రధానమైన గుణ మును మానవుడు గ్రహించి తద్గుణవాచకశబ్దముచే నా వస్తువును పిలిచియుండవచ్చును "క్రా" యను కాకి అరపు దాని విశిష్టలక్షణ ముగ తోచుటవలన మానవుడు ఆ పక్షిని కాకి కాక క్రో—శబ్ద ములచే వ్యవహరించియుండవచ్చును

"ద్విప కేసరి సర్ప ఉరగ" ఇత్యాది శబ్దము లీవిధము ననే యేర్పడియుండుననుటకో సందేహములేదు రెండుమా ర్లు అను రెంటిని నుపయోగించి నీరు త్రాగుట ఏనుగు లక్ష ణము కేసరముతో నొప్పియుండుట, ప్రాకుట ఎదచే ముందు నకు బోవుట —అనునవి సింహముయొక్కయు పాముయొక్కయు లక్షణములు "పాము అనెడి ఒకేప్రాణికే సర్ప ఉరగములను పర్యాయపదము లుండుటకూడ గమనింపదగినది ప్రాచీనభాషలో పర్యాయపదము లెక్కువ వివిధ ప్రదేశములందలి జనులు ఆయా జంతువులను తొలిసారి చూచినప్పుడు వాని వివిధలక్షణములను పురస్కరించుకొని వానికి వాచకశబ్దములను కల్పించుకొనియుండు రని తోచుచున్నది నెమలికిగల కేకి శిఖి బర్హిన్ మున్నగు పర్యాయపదములను గమనించునది అనేకములగు వాచకశబ్దములు క్రియావాచకములనుండి యేర్పడియుండుటకూడ భాష మానవ కల్పితమను వాదమునకు పోషకమని Herder అభిప్రాయము భాష ఈశ్వరకల్పితమైనచో నామవాచకసృష్టియే మొదట జరుగుట హేతుబద్ధమగునుకదా యని అతని ప్రశ్న ప్రకృతిపరిణామము ననుసరించి భాషకూడ క్రమముగ నేర్పడినను నితని వాదన తర్క బద్ధము సమంజసము నని అంగీకరింపక తప్పదు పామరజన ప్రచారమునందుండిన గేయసారస్వతమునకును సార్వజనీనకావ్య ములకును ప్రాధాన్యమునిచ్చి యందలి భాషను పరిశీలించినవాడు Herder భాషకును ప్రాచీన కావ్యరచనకును సన్నిహితసంబంధము కలదని యితడు గుర్తించినాడు భాష సారస్వతసృష్టికి సాధన మగుటమాత్రమేకాదు భాషయే సారస్వతము కవిత్వము నగునని అతని అభిప్రాయము జాతియొక్క ఆత్మ భాషయందు వ్యక్తమగు నని యితని భావము

నిసర్గ సంబంధవాదము —శబ్దార్థములకు నిగూఢము, నిస ర్గమునగు నాంతరంగికసంబంధము కలదనియు నా కారణముచే వాచ్యములగు వస్తువులకు మన సంకల్పములేకయే వాచకములు సిద్ధించునవనియు భాష యీవిధముననే యేర్పడినదనియు నొక వాదము యూరోపుఖండమున వ్యాప్తికివచ్చినది దీనిని ప్రతి పాదించినవాడు Max Muller అను భాషాశాస్త్రజ్ఞుడు ప్రకృతిలోని ప్రతిపదార్థమునందును నొక ప్రత్యేకము విలక్షణమునగు "అను నాదము" కలదనియు, వారి అమితమనోహర నావస్తువును తాకి నప్పుడు ఆ అనునాదము వ్యక్తమగుననియు తెలియుచున్నది

అట్లే, బాహ్యవిషయము ఇంద్రియములద్వారా మానవుని హృదయమును స్పృశించుటతో వశవి హృదయమును, వాగింద్రియములను తద్వస్తుస్వభావానుగుణమగు స్పందనకు లోనై తద్విలక్షణాను వాదమును ఉత్పన్నము చేయుననియు ఈ వాదము తెలుపుచున్నది కాని మానవుని హృదయమునకు బాహ్యవస్తువులతో నింద్రియములద్వారా సంయోగ మేర్పడినపు డుత్పన్నమగు నాదము ఆ మానవుని స్వభావానుగుణమైనది కావలెనుకాని తద్వస్తుస్వభావానుగుణమైనది కాదుకదా? ఇందు అభిహతమైనది మానవహృదయమేకాని బాహ్యవస్తువుకాదుకనుక నుత్పన్నమగు నాదము హృదయవాచకము కావలెనేకాని వస్తువాచకము కాజాలదు లేదా మానవహృదయము తత్తద్వస్తువుల విలక్షణానువాదముల నుత్పన్నముచేయుటకు సమర్థమైయున్నదనియు నీకారణమున మానవప్రకృతి యితర వస్తుప్రకృతికంటెను భిన్నమనియు నంగీకరింపవలసియుండును [ఇది యీ వాద ప్రధానసూత్రమునకే విరుద్ధము] ఎట్లొప్పుకొన్నను అభిన్నమగు వస్తువునకు భిన్నభాషలలో భిన్నవాచకము లెట్లేర్పడినవను ప్రశ్నకు సమాధానము కుదురదు కనుక ఈ వాద మంగీకృతముకాదు ఆకాలముననే యీ వాదము హాస్యాస్పదమగుటచే దీనిని ప్రతిపాదించిన Max Muller కూడ దీనిని విడిచిపుచ్చినాడు ఈ వాదమునకే డింగుడాంగు వాదమను విరూపక మానాడే ఏర్పడినది

శబ్దానుకృతివాదము.—పశుపక్ష్యాదులు చేయు ధ్వనులను గమనించి మానవుడు ఆయా ధ్వనులనే వానికి సంజ్ఞలుగ జేసికొని వ్యవహరింప నారంభించెననియు నా సంజ్ఞలే భాషయందు నామవాచకములుగను, క్రియావాచకములుగను పరిణమించెననియు నొక వాదము ప్రాచీనకాలమున ప్రతిపాద్యమైనది దీనికే శబ్దానుకృతి వాదమని పేరు (Onomatopoeia) కలిగినది కోకిలధ్వని "కుహూ" "కూ" "కో" అని వినబడుచుండుటచే ధ్వని ననుకరించిన మానవుడు కుకూ (Cuckoo) కోయిల కోకిల శబ్దముల నా పక్షికి వాచకములుగా చేసికొన్నాడు అట్లే కుక్కచేయు "గుర్రు"మను ధ్వనివలన కుక్కుర, కుర్కుర కుక్క అను శబ్దములు ఏర్పడియుండును కోడి చేయు "కుక్ క్రాక్ కాక్కాక్" మున్నగు ధ్వనులనుండి కుక్కుట, Cock శబ్దము లేర్పడియుండును అట్లే కాక కాకి Crow శబ్దములును నేర్పడినవనుటలో సందేహములేదు పూర్వము యాస్కాదులు కూడ ఈ శబ్దానుకృతికిగల ప్రాధాన్యమును గమనించి కొన్ని యుదాహరణములు నిచ్చియున్నారు బల్లి చేయు "కృక్ క్లుక్" శబ్దానుకృతివలన కృకవాకు కృకలాస శబ్దము లేర్పడినవి కృకవాకుశబ్దము నెమలికి కోడిపుంజునకుకూడ వాచకములై యుండుట గమనింపదగినది శబ్దానుకృతివలన యిట్లొక శబ్దరూపమే భిన్నప్రాణులకు వాచకముగ సిద్ధించినది "కాక ఇతి శబ్దానుకృతి స్తదిదం శకునిషు బహులమ్" అని యాస్కుడు శబ్దానుకృతి కుదాహరణము లిచ్చినాడు జూదమునందు ఓడుటవాడు పణములనొడ్డి యోడుచుండగా గెలిచినవాడు "కిం తవ" (అస్తి) (ఇంకా నీయొద్ద ఏమున్నది) "మరి నీ పణమేమి" అను మాటిమాటికి అడుగుచుండుటవలన "కింతవ" శబ్దములనుండి "కితవ" శబ్ద మేర్పడినదని వివరింపబడియున్నది దానపరుడగు వ్యక్తి (దాత) యాచకుని కోరికలను దీర్చుచు, నింకను నియ్యదలచినవాడై "పద అన్యమ్" [అన్యము (నింకను) కోరుకొనుము] అని పదేపదే అడుగుచుండుటవలన (వద + అన్యం) వదాన్య శబ్ద మేర్పడినదని వ్యుత్పత్తి ప్రదర్శింపబడినది. కొన్ని వ్యక్తిగతనామములుకూడ నిట్లేర్పడినవని పతంజలి యర్వాణ తర్వాణ శబ్దము నుదాహరించినాడు కాని యీ రెండు శబ్దములును హేళన నుద్దేశించి యేర్పడిన "విరూపకము" (Nicknames) లగుటచే వానిని ప్రమాణములుగ గ్రహింపనక్కరలేదు పటపట మరమర జలజల ఝణంఝణ ఇత్యాది శబ్దము లన్నియు ధ్వన్యనుకరణములే యని పాణినియు నంగీకరించినాడు దుందుభి భేరి డమరుకము, Drum మున్నగు శబ్దములన్నియు ధ్వన్యనుకరణమున నేర్పడినవియే ఇట్లు వసీనుల మాత్రమేకాక యాస్క పతంజలి పాణిన్యాది ప్రాచీన శాబ్దికులుకూడ శబ్దానుకృతిని గమనించుటయేకాక తద్విషయమును చర్చించియున్నారు కాని భాషయందలి శబ్దములలో ఎక్కువభాగమున కిట్లు వ్యుత్పత్తిని చూప వీలులేదు ఔపమన్యవుడు శబ్దానుకృతినే అంగీకరింపలేదు "న శబ్దానుకృతిర్విద్యతే ఇత్యౌపమన్యవః" మరియు నీవాదమునకు ముఖ్యమగు నొకయాక్షేపణ కలదు పశుపక్ష్యాదుల ధ్వనుల ననుకరించి వాచకశబ్దముల నేర్పరచుకొన్న మానవుడు తనతోడిమానవుల శబ్దములనుగూడ ననుకరించియుండవలయుననుట హేతుబద్ధముగనున్నది ప్రాచీనకాలమందుకూడ మానవులపేర్లు ఈ విధమున నేర్పడినట్లు నిదర్శనములు లేవు ప్రాచీనవాఙ్మయమున గల వ్యక్తినామములకు ఈ వ్యుత్పత్తి ప్రదర్శింపబూనుట హాస్యాస్పదము కాకపోదు కనుక, శబ్దానుకృతి వాదము కొన్నిశబ్దములకు మాత్రమే వ్యుత్పత్తిని నిరూపింపగలదు కాని భాషోత్పత్తివిధానమును ప్రదర్శింపజాలదు ఈవాదమునకే బౌవౌవాదమను హేళననామము కల్గినది

ఆవేగజన్యవాదము.—తీవ్రములగు భావావేగ ఆశ్చర్య ఆవేశముల కారణమున అంతఃప్రేరితములై నిర్గమించిన "ఆహా హా అయ్యో అరరే"—మున్నగు ధ్వనులనుండి భాష యేర్పడినదని మరియొకవాదము కలదు ఆశ్చర్యావేగాదులు కలిగినప్పుడు అప్రయత్నముగ నేదోయొకశబ్ద ముచ్చరితమగుట ప్రసిద్ధము కాని యిట్టిశబ్దము లతిస్వల్పములు భాషయందు గల మూలధ్వనులన్నిటి

కిని వీనినుండి యుత్పత్తిని జూపుటకు—శాస్త్రరీత్యా—సాధ్యము కాదు అదికాక ఆవేగాద్యనుభవకాలమున ఈధ్వను లుచ్చరితమగు టకు కారణము భావవ్యక్తీకరణప్రయత్నముకాదు ఈ ధ్వనుల యుచ్చారణకు అప్రయత్నమగు దైహికప్రవృత్తియే కారణముకాని మనఃప్రవృత్తి కాదని డార్విను పండితుడు తన "భావావిష్కరణము" అను గ్రంథమున వివరించినాడు అసహ్యభావమో విరసనభావమో కలిగినపుడు ముక్కుతోనో నోటితోనో ఊపిరివిడచుట అప్రయత్న మగు దైహికప్రవృత్తి అట్లు ఊపిరి వెలికినిర్గమించుటలో "ఉఫ్ ఉశ్" అనుధ్వనులుత్పత్తిల్లుటయు సహజమే అట్లే అకస్మాత్తుగ ఆశ్చర్యాద్యనుభవములు కలిగినపుడు గాఢము తీవ్రము నగు మహోచ్ఛ్వాసమును గైకొనుటయు తత్కారణమున కొన్నిధ్వను లుత్పన్నములగుటయు స్వాభావికముగ జరుగుచున్నది హఠాత్తుగా కలిగిన ఆవేశాశ్చర్యాద్యనుభవములు కారణమున నకస్మాత్తుగ నుత్పన్నములైనవి యీ ధ్వనులగుటచే వీనిని భాషామూలములు అనుటకు వీలులేదు భాషణకు అవకాశము వ్యవధి లేని సందర్భ ములందే యీ ధ్వనులు నిర్గమించుచున్నవి భాషణయందు మన స్సంకల్పము ప్రధానము అట్టి సంకల్ప మీ ఆశ్చర్యాద్యర్థకముల యుత్పత్తియందు లేనికారణమున నివి భాషాజననకారణములగుట సంభవింపదు ఈవాదమునకు "పూహూ" వాదమని హేళననామము కలిగినది

"యోహేహోసిద్ధాంత"మను మరియొక విచిత్రవాదమును "నోయిర్" అను పాశ్చాత్యపండితుడు ప్రతిపాదించినాడు దైహిక మగుపరిశ్రమతో నెప్పుడైనను మనుష్యుడు క్రమపునరావృత్తిననుస రించి గాఢముగ నిశ్వసించుచుండిన శ్రమ కొంత తగ్గగలదనుట ప్రకృతిసహజమగు విషయము బరువులను లాగెడివారును పల్లకీ బోయీలును ధాన్యము దంచెడివారును ఈరగా నేవో ధ్వనులను పునరావృత్తములగునట్లు పలుకుచుండుట యందులకు నిదర్శనము అట్లే ప్రాచీనకాలమున నవేకులు కలసి పనిచేయుసందర్భములలో వారుచ్చరించిన ధ్వనులే ఆయా పనులకు వాచకములుగా ఏర్పడి యుండునవియు నట్లే భాష యేర్పడియుండునవియు నీపండితుని విచిత్రవాదము ఈవాద మతని కాలముననే హాస్యాస్పదమైనది

ఇట్లు పైవాదములు భాషయందలి యేవో కొన్ని శబ్దము లకు వ్యుత్పత్తిని చూపించుటకు చాలియున్నవేకాని సమగ్రముగ భాషోత్పత్తిని నిరూపించుటకు సమర్థములుకావు

నిరుక్తగ్రంథములలో అవలంబింపబడిన వ్యాకృతివిధానము ననుసరించి భాషయంతయు ధాతువులనుండి యుత్పన్నమైనది అను నొకవాదము వ్యాప్తికివచ్చినది శబ్దములన్నియు క్రియావాచ కములగు ధాతువులనుండి యుత్పన్నమైనదను వాదము శాకటాయ నునిచే ప్రతిపాదితమైనది దీనిని గ్రహించి నైరుక్తులు ప్రతిశబ్దము నకును మూలధాతువులనుండి వ్యుత్పత్తిని జూప ప్రయత్నించినారు

"నామాన్యాఖ్యాతజానీతి శాకటాయనో నైరుక్తసమయశ్చ"

ఈవాదముననుసరించి క్రియావాచక ధాతుమయమగుభాష యొక ప్పుడుండెనని అంగీకరింపవలసియుండును భాషాశైశవకాలమున మానవులు తమభావములను, ఆంతరంగికావేశ కారణమున నుత్ప న్నములైన యీధ్వనులమూలమున వ్యక్తముచేసియుండురనియు ప్రతిధ్వనియు సాధారణముగ సంపూర్ణవాక్యసదృశమై యొకక్రియా ప్రవృత్తిని సూచించుచుండెననియు భావింపవలసియున్నది

శబ్దములను వ్యాకృతివిధానముననుసరించి విభజించుచుండగా మూలశబ్దముయొక్క అర్థమునుగోల్పోక నిలిచిన అవిభాజ్యమగు ధ్వనిరూపము ధాతువనియు అది క్రియావాచకమనియు శాకటాయ నాదుల మతము నయము వినయము ప్రణయము నయనము ఉపనయనము నీతి వినీతి అవినీతి నేత నాయకుడు నాయిక నయక —మున్నగు శబ్దములను పరిశీలింపగా వి ప్ర ఉప అవి—మున్నగునవన్నియు అర్థవిస్తృతి అర్థవైశిష్ట్యములకై చేరిన ధ్వనులనియు అన్నిశబ్దములందును సామాన్యమగు "నీ" అను దానియందే మూలార్థమిమిడియున్నదనియు విదితమగుచున్నది ఈ నీ అనుధ్వని నింకను విభజించినచో మూలశబ్దార్థమునకు భంగముకలుగును ఇదియే అర్థవంతము అవిభాజ్యము నగు ధ్వనిరూపము, ఇదియే ధాతువు ఈవిధముననే భాషయందలి శబ్దములన్నియు ఏర్పడియుండునని భావము భౌతికవస్తువులను శాస్త్రీయవిధానమున వ్యాకరింపగా లభించు పరమాణువులవంటివి ఈ ధాతువులు వైయాయికులును వైశేషికులును సృష్టివిషయ మునవలెనే భాషావిషయమునను పరమాణువాదమును ప్రతిపా దించియుండుట గమనింపనగును

"ధాతు" వనగా "సత్త్వసారము" అని అర్థము శబ్దముచే బోధ్యమగు సర్వసారము దీనియందిమిడియుండుటచే ధాతువు అని దీనికి వ్యవహారము ఈ ధాతువులను Sayce అను భాషాశాస్త్రజ్ఞుడు వృక్షమూలములతో బోల్చియున్నాడు సూక్ష్మమగు మూలము నాధారముగజేసికొని మహావృక్షము వృద్ధికివచ్చినట్లు ధాతువుల యాధారమున భాష పెరిగినదని భావము ధాతువును ప్రకృతియని కూడ వైయాకరణులు వ్యవహరించినారు ఇవి క్రియావాచకములే యగునుగాని నామవాచకములుకావని వీరి అభిప్రాయము — నామవాచకక్రియావాచకములకు ఎక్కువ భేదములేదనియు రెండును ఏకకాలజన్యములేయనియు Sayce నమ్మకము నామవాచకరూప ములే క్రమశైథిల్యమునకులోనై క్రియారూపములుగ నేర్పడినవను అభిప్రాయమును గలడు ఈ ధాతురూపములు చాలవరకు స్వతంత్ర ప్రయోగార్హములుకావు ప్రత్యయాదులసంయోగమున క్రియాపదము

లుగ నేర్పడి ప్రయుక్తములగుచున్నవి క్రియాపదరూపములు సంపూర్ణభావబోధకములై యుండినవని చెప్పుటకు నిదర్శనము లున్నవి "అస్మి" అను రూపము ("అహం అస్మి") "నేను ఉన్నాను" అను సంపూర్ణభావమును బోధింపజాలియున్నది అట్లే భవిష్యతి, వర్తతే, అగాను మున్నగు రూపములు సంక్షేపవాక్యము లని చెప్పవచ్చును భూ దా మున్నగు మూలధాతువు లతిప్రాచీనము లనియు లిజంత సన్నంతాది ప్రత్యయాంతధాతువులు తరువాత ఏర్పడినవనియు అభిప్రాయము కలదు

ధాత్వర్థము క్రియావాచకమని భారతీయవైయాకరణుల మతము అన ధాతువుచే బోధ్యమగునది క్రియాఫలమా లేక క్రియావ్యాపారమా యనువిషయమున భిన్నాభిప్రాయము లలవు ధాతువుచే బోధ్యమగునది ఫలమగుననియు వ్యాపారము తిజాది ప్రత్యయములచే వ్యక్తమగుననియు మీమాంసకుల అభిప్రాయము

"ఫలమాత్రం ధాత్వర్థః వ్యాపారః ప్రత్యయార్థః

గంగేశాది నైయాయికు లీయభిప్రాయమునకు భిన్నులు ఫలాను కూలమైన వ్యాపారమే ధాతువుచే బోధ్యమగుచున్నదని వీరివాదము

"ఫలానుకూలో వ్యాపారఏవ ధాత్వర్థః'

వాక్యముచే గమ్యమానమగునర్థము (శబ్దబోధ) అందలి ప్రత్యేక శబ్దములు బోధించు నర్థముకంటెను విశేషమైనది యగుటచే సంయోగాదిరూపఫలవిశేషావచ్ఛిన్నమగు నర్థము ధాతువుచే బోధ్యమగుటయే సమంజసము ఈ యభిప్రాయమును నైయాయి కులను వైయాకరణులనుకూడ అంగీకరించినారు

కాని భాషయందలి శబ్దములన్నియు ధాతువులనుండి వ్యుత్ప న్నములైనవని నిరూపించుటకు సాధ్యముకాదు కనుకనే గార్గ్యాది వైయాకరణు లాకాలముననే యీవాదమును ప్రతిఘటించినారు

"నసర్వాణీతి గార్గ్యో వైయాకరణానాం చైకే "

ఉణాదివర్గమునకు చెందిన శబ్దములు వ్యాకృతివిధానమునకు లొంగవు వ్యుత్పత్తి నిరూపింపలేని శబ్దములను యాస్కాదులు 'అసంవిజ్ఞాతములు" అవ్యుత్పన్నములు "ప్రతిపత్క్రియలు" అని వ్యవహరించినారు పాణిని కూడ వీనికి వ్యుత్పత్తిని చూప ప్రయ త్నింపలేదు అట్టి ప్రయత్నము అశాస్త్రీయము కృతకము నని యతడు తలచియుండవచ్చును నిరుక్తకారులు మాత్రము తమ సిద్ధాంతపోషణకై అవ్యుత్పన్న శబ్దములకుకూడ భావనాత్మక కృత్రిమవ్యుత్పత్తుల నొసంగినారు ధాత్వర్థముబట్టి శబ్దములేర్పడి యుండినచో నొకక్రియావ్యాపారమున కాశ్రయమైన ప్రాణులన్నియు నొకవాచకముచేతనే వ్యవహరింపబడియుండెడివి

"గమ్" ధాతువునుండి "గోవు" అను శబ్దమేర్పడియుండి నచో నాశబ్దము ఆవునకు మాత్రమేకాక గమనవ్యాపారాశ్రయము లైన ప్రాణులన్నిటికిని వాచకమై యుండెడిది మరియు వ్యాపార మునుండి నామము లేర్పడుచో ప్రాణిచేయు ననేకములగు వ్యాపారములనుబట్టి దాని కనేకములగు వాచకము లేర్పడవలసి యుండును అదియుకాక ధాతువులతో మాత్రమే మానవు లొక ప్పుడు వ్యవహరించుచుండిరనుట భ్రమయనక తప్పదు వ్యాపార శక్తి యేమాత్రమును వ్యక్తముకాని జడపదార్థములకు ఏక్రియా ధాతువులనుండి వాచకములేర్పడినవను ప్రశ్న యుదయింపక మానదు కనుక ధాతువులనుండియే భాషయందలి శబ్దజాలమం తయు నుత్పన్నమైనదనుట పొసగదు

భాషోత్పత్తినిగూర్చిన వాదము లేవియు సమగ్రములుకావు భాషయందలి కొన్నిశబ్దముల విషయమునందు దివి వర్తించునే కాని భాషాసమగ్రస్వరూపము నివి వివరింపజాలవు మరియు వ్యస్తపద ముల యుత్పత్తి సమగ్రభాషోత్పత్తి కాజాలదు మానసికప్రవృత్తికి భాష బాహ్యస్వరూప మగుటచే నొకవిధముగ మానవుని ఆలోచనా ప్రపంచమునకు భాష చరిత్రయగునని చెప్పవచ్చును ఒకజాతి యొక్క బుద్ధివిస్తృతి దృక్పథము విశిష్టలక్షణము ఆదర్శము— ఇత్యాదులన్నియు భాషలో నిహితములైయుండును మానవుని బుద్ధి వికాసమున కుత్పత్తి నేర్పరచుట యెట్లు సాధ్యముకాదో అట్లే భాషా విషయమునకూడ ఉత్పత్తినిరూపణము సాధ్యము కాదు

వర్ణాత్మకమగు భాషావిషయ మటుండ మొదట శబ్దము ( Sound ) ఎట్లుత్పన్నమగుచున్నదని పరిశీలించుటయు ముఖ్యమే ప్రాచీను లీవిషయమును విపులముగ చర్చించినారు భాషాతత్త్వ మునుగూర్చి భిన్నమతము లేర్పడినట్లె శబ్దోత్పత్తి విషయమున గూడ మీమాంసక నైయాయిక వైయాకరణాది శాస్త్రీయకుల కభి ప్రాయభేదము లేర్పడినవి

శబ్దస్వభావమునుగూర్చి చర్చించుచు మొదట శబ్దమన నేమి యని ప్రశ్నించుకొని స్పష్టము అర్థవంతము నగు ధ్వనియే శబ్ద మని ప్రాచీనులు నిర్వచించినారు జాతిగుణక్రియాదులకంటెను భిన్నమైనది శబ్దస్వభావ మని పతంజలి యభిప్రాయము మరి కొందరు శబ్దము రెండువిధములని పరిగణించి వానిని ధ్వని, వర్ణము నని వ్యవహరించినారు భేరీమృదంగాది వాద్యములనుండి యుత్పన్నమగునది ధ్వన్యాత్మక శబ్దమనియు వివిధవర్ణములుగ విభజించుటకు వీలగునది వర్ణాత్మక శబ్దమనియు వీనికి వివరణ వర్ణాత్మకమైన ధ్వనిమాత్రమే శబ్దముగ శాబ్దికు లంగీకరించినారు

పరాపశ్యంతీమధ్యమావైఖరీ వాగ్భేదములలో వైఖరియొక్క టియే వర్ణాత్మకమైనది అనగా శ్రోత్రగ్రాహ్యమగు వైఖరీవాక్కు

నందు వివిధవర్ణములను సుస్పష్టములైయున్నవని భావము వర్ణములే శబ్దమని శంకరులవారు నిశ్చయించి తదభిప్రాయపోషకముగ ఉపవర్షమహర్షిని స్మరించినారు

"వర్ణా ఏవ తు శబ్ద ఇతి భగవానుపవర్షః"

శబ్దము నిత్యమా అనిత్యమా అనువిషయమున నైయాయికులును మీమాంసకులును భిన్నాభిప్రాయములు కలవారైయున్నారు వాగింద్రియములచే శబ్ద ముత్పత్తియగుచున్నదని నైయాయికుల వాదము ఉత్పత్తి యను పదము ప్రాగభావమును సూచించును అనగా ఒక వస్తువు సృష్టికివచ్చినదన్నచో అది యంతకుముందు లేదనియే యర్థము కనుక వీరి యభిప్రాయము ననుసరించి శబ్దమునకు నిత్యత్వము లేదని తేలుచున్నది వాగింద్రియములు శబ్దము నుత్పన్నముచేయుటలేదనియు నవి శబ్దమును అభివ్యక్తము చేయుచున్నవనియు మీమాంసకుల వాదము అభివ్యక్తము అను పద ప్రయోగముచే శబ్ద మిదివరకే యున్నదనియు నది యిప్పుడు వాగింద్రియప్రవృత్తిచే వ్యక్తమైనదనియు గమ్యమానమగుచున్నది కావున మీమాంసకుల మతమున శబ్దము నిత్యమైనది

"తతో నిత్యప్రత్యయసామర్థ్యాత్ ప్రయత్నేనాభివ్యజ్యతే"

అవ్యక్తముగనుండిన నిత్యమగు శబ్దము వాగింద్రియప్రవృత్తిచే అభివ్యక్తమగుచున్నదని వీరి భావము దీపకాంతిచే పదార్థములు దృగ్గోచరములగుచున్నవియేకాని లేనిపదార్థములు సృష్టింపబడుటలేదు చీకటిప్రాబల్యమున నయనగ్రాహ్యములు కానివానిని కాంతివంతములనుగాజేసి ఇంద్రియగ్రాహ్యయోగ్యములుగ నొనర్చుటయే దీపమువలని ప్రయోజనము కనుక దీపము అభివ్యంజకము మాత్రమే యగును. అట్లే అవ్యక్తముగనున్న శబ్దమును శ్రవణగోచరముగ నొనర్చునవి వాగింద్రియములు

"యథా ఘటాదేర్దీపాదిః అభివ్యంజక ఇష్యతే
చక్షుషోఽనుగ్రహాత్ ఏవం ధ్వనిః స్యాచ్ఛ్రోత్రసంస్కృతేః॥

ధ్వని ( Sound ) వస్తువున సహజసిద్ధమనియు వస్తువు అభిహతమైనప్పుడు ఆధ్వని అభివ్యక్తమగుచున్నదని మీమాంసక మతము. అట్లభివ్యక్తమగుటకు కారణములగునవి అభివ్యంజకములు వాయుసంబంధములైన సంయోగవిభాగములే ఈ అభివ్యక్తికి కారణములు

"సంయోగవిభాగావేవ అభివ్యంజకా ఇతి వక్ష్యమః

ధ్వనియుత్పత్తి విషయమున మీమాంసకులు అవలంబించిన విధాన మిది

వాయువుయొక్క సంయోగవిభాగములకు ధ్వనివిషయమున గల ప్రాధాన్యమును నైయాయికులుకూడ నంగీకరించినారు కాని ఈసంయోగవిభాగములే శబ్దోత్పత్తికి కారణములగుచున్నవని వీరి మతము ఒకానొకకారణ మాధారముగ కార్యరూపమున పర్యవసితమగుచున్నదియు, నాకారణము తొలగినవెంటనే నశించునట్టిదియు నగు విషయము నిత్యముకాజాలదు అట్టి లక్షణములతో నొప్పు ధ్వనియు నిత్యముకాదనియు నది వాయుసంయోగవిభాగముల మూలమున నుత్పన్నమగుచున్నదనియు కనుక కృతకమనియు వాత్స్యాయనుడు నిశ్చయించినాడు

"తస్మాదుత్పద్యతే శబ్దో నాభివ్యజ్యతే"

వాగింద్రియప్రవృత్తి శబ్దోత్పత్తికి నిమిత్తము అట్లుత్పన్నమైన శబ్దము వీచీతరంగన్యాయమున ప్రసరించి శ్రవణేంద్రియ సంయోగము నంది గ్రాహ్యమగుచున్నది శబ్దోత్పత్తికి దైహిక ప్రయత్నముకూడ ఆవసరమగుచున్నది మరియు తీవ్రము మందము అను గుణములుకూడ శబ్దమునకు గలవు ఈవాలుగును నిత్యత్వలక్షణములు కావనియు కావున నీలక్షణములతోనొప్పు శబ్దము నిత్యముకాదనియు నైయాయికుల నిశ్చయము

శబ్దప్రసారము విషయమున నైయాయికులు ప్రతిపాదించిన వీచీతరంగన్యాయము ముఖ్యముగా గమనింపతగినది

ఉత్పత్తిమత్యేతు వీచీతరంగన్యాయేన శబ్దాత్
శబ్దాంతరోత్పత్త్యా శ్రవణేంద్రియవ్యాప్తిః సంభవతి '

శబ్దము వ్యాప్తిచెందుటతో నుత్తరోత్తర శబ్దపరంపరల యుత్పత్తికి కారణమగుచున్నదనియు నట్లుత్పన్నములైన శబ్దములలో కడపటిది శ్రవణేంద్రియమును తాకి దానిచే గ్రాహ్యమగుచున్నదనియు వీరి అభిప్రాయము శబ్దము ప్రసారము (Transmission) నందుటలో వాయుతరంగము లుత్పన్నములగుటయు నీ తరంగ పరంపరలద్వారా శాబ్దికశక్తి (Sound Energy) క్రమవ్యాప్తి నందుటయు శాస్త్రీయప్రయోగములచే నిరూపితమైన విషయము సంక్షోభకారణముగా జలమునం దుత్పన్నమైన యొక తరంగమునుండి ఊర్మికాపరంపర లుత్పన్నములై చుట్టును నెట్లు వ్యాపించుచున్నవో అట్లే వాగింద్రియవ్యాపారముచే నుత్పన్నమైన శబ్దమునుండి శబ్ద తరంగము లేర్పడి (వీచీతరంగన్యాయమున) వ్యాపించుచున్న వనియు భావము

యుచ్చరితమైన యొకశబ్దమునుండి పదిశబ్దము లొక్కసారిగా భిన్నప్రదేశములం దుత్పన్నములగుననియు నవి మరల నట్టి శబ్దము లనేకముల నుత్పాదించుననియు నొకవాదము కలదు దీనికి కదంబకోరకన్యాయమని వ్యవహారము

వాయువు అణువుల జ్ఞానము—అనివానిలో ప్రతియొకటియు శబ్దోత్పత్తికి సమర్థమైనదని ప్రాచీనుల యభిప్రాయమైనట్లు వాక్యపదీయమువలన తెలియుచున్నది

కి న్నె ర

"వాయోరణూనాం జ్ఞానస్య శబ్దత్వాపత్తిరిష్యతే "
"నైకశ్చిద్దర్శనభేదో హి ప్రవాదేష్వనవస్థితః "

శబ్దోత్పత్తివిగూర్చి భిన్నమతము లుండినట్లును తెలియుచున్నది

శబ్దోత్పత్తి శబ్దప్రసారముల విషయమున వాయువునకుగల ప్రాధాన్యము శాస్త్రీయప్రయోగసిద్ధము ఇది ప్రాచీనకాలమునవే శాబ్దికులచే గుర్తింపబడియుండుట గమనింపదగినది న్యాయ వైశేషిక సాంఖ్య మీమాంసాదు లెల్లరును శబ్దము ఆకాశగుణమని అంగీకరించినారు ఆంతరప్రత్యయముచే ప్రేరితమైన వాయువే వాగింద్రియాభిహతమై శబ్దమగుచున్నదని భర్తృహరి వివరించినాడు

"లబ్ధక్రియః ప్రయత్నేన వక్తురిచ్ఛానువర్తినా
స్థానేష్వభిహతో వాయుః శబ్దత్వం ప్రతిపద్యతే "

మహాభారతమున బ్రాహ్మణగీతలయందుకూడ, వాయువే శబ్దోత్పత్తి విషయమునందు ప్రధానమని వివరింపబడియున్నది

"ప్రాణాపానాన్తరే దేవీ వాగ్ వై నిత్యంహి తిష్ఠతి "

ప్రాణమను ఉచ్ఛ్వాసమునకును అపానమను నిశ్వాసమునకును మధ్య గల వ్యానమనెడి వాయువే వాక్కనియు, నాకారణమునవే భాషణసందర్భమున ఉచ్ఛ్వాసనిశ్వాసములు రెండును ప్రవర్తింప వనియు ఛాందోగ్యోపనిషత్తు వర్ణించుచున్నది

"అథయః ప్రాణాపానయోః సంధిః స వ్యానం సా వాక్
తస్మాదప్రాణన్నపానన్ వాచమభివ్యాహరతి "

శిక్షాగ్రంథములలోకూడ ఆంతరవాయువే శబ్దోత్పత్తికి మూలమని తెలుపబడియున్నది వ్యక్తముచేయదలచిన అర్థమును బుద్ధిసాహాయ్యముచే ఆత్మ నిశ్చయించి తద్వ్యాపారమునకై మనస్సును ప్రేరేపించుచున్నది అట్లు ప్రేరితమైనమనస్సుచే దేహనిష్ఠమగువగ్ని అభిహతమై ఆంతరవాయువును చలింపజేయుచున్నది ఈవిధముగ సంచలితమైన వాయువు క్రమమున మూర్ధ్వముగ వ్యాపించి వాగింద్రియములను చెందుచున్నది

"ఆత్మా బుద్ధ్యాసమేత్యార్థాన్ మనో యుంక్తే వివక్షయా
మనః కాయాగ్నిమాహన్తి స ప్రేరయతి మారుతమ్

ఈ అభిప్రాయము వనేకు లంగీకరించినారు శబరస్వామి శబ్దోత్పత్తి కెక్కువ ప్రయత్నమవసరమని తెలుపుచు శబ్దముత్పన్నమగుటలో వాయు వేయే దేహభాగముల వ్యాపించుచున్నదో వివరించినాడు మొదట నాభినుండి బయలుదేరిన వాయువు హృదయమున విస్తృతిచెంది, కంఠభాగమున పలువిధములుగ వివర్తములకు లోనగుచున్నది పిమ్మట నది మూర్ధముసకాకి మెసకకుమరలి వక్త్రమున చరించి వివిధశబ్దములను కలుగజేయుచున్నది

"వాయుర్నాభేరుత్థితః, ఉరసివిస్తీర్ణః, కంఠేవివర్తితః
మూర్ధానమాహత్య పరావృత్తః వక్త్రేవిచరన్ వివిధాన్
శబ్దాన్ అభివ్యనక్తి "

వైశేషికులు —అర్థవ్యక్తీకరణేచ్ఛ కలిగినపుడు మనస్సున కాత్మతో సంయోగమేర్పడుచున్నది ఈ సంయోగమే శబ్దోచ్చారణకు హేతువు ఈశబ్దముయొక్క యుచ్చారణలో స్మృతిగతము లగు శబ్దముల ప్రత్యభిజ్ఞయు కలదు ఉచ్చారణేచ్ఛానంతరము జరుగు ప్రయత్నములచే వాయువు ప్రచలితమగుచున్నది ఆవాయు వూర్ధ్వముగ ప్రసరించి కంఠాదివాగింద్రియములను తాకి శబ్దోత్పత్తిని కలిగించుచున్నది

"తత్రవర్ణలక్షణస్యోత్పత్తి రాత్మమనసోః సంయోగాత్
స్మృత్యపేక్షా ద్వర్ణోచ్చారణేచ్ఛా తదనంతరమ్ ప్రయత్నః
తమపేక్షమాణా దాత్మవాయుసంయోగాత్ వాయౌ కర్మ
జాయతే స చోర్ధ్వం గచ్ఛన్ కంఠాదీనభిహన్తి "

అంతఃకరణ ప్రాబల్యమునుచెందిన వాయువే, తద్ధర్మముచే కర్ణగోచరమగు శబ్దరూపముగ వివర్తము నొందుచున్నదని భర్తృహరి తెలుపుచున్నాడు

"అంతఃకరణతత్త్వస్య వాయురాశ్రయతాంగతః
తద్ధర్మేణసమావిష్టస్తేజసైవవివర్తతే "

ఈ అభిప్రాయమును వ్యక్తపరచుచు పుణ్యరాజు తన వ్యాఖ్యానమున శబ్దోత్పత్తివిగూర్చిన పలువివరణల నొసంగియున్నాడు శబ్దోత్పత్తి వలయు వాయువు బాహ్యమైనదికాదు అది అంతర్నిహితమైన వాయువు నాభి మండలమే వాయుస్థానమని సాధారణముగ నభిప్రాయమైయున్నది ఇందుండి బయలుదేరిన వాయువే క్రమముగ మూర్ధ్వముఖమై ప్రసరించి, వాగింద్రియములను చెందుచున్నదని భావము

తాంత్రికుల అభిప్రాయము కొంతభిన్నముగ నున్నది చిచ్ఛక్తికి స్థానమగు మూలాధారమునుండియే సకలప్రవృత్తులకును ప్రేరణ లుద్బుద్ధములగుచున్నవని తాంత్రికుల భావము ప్రతిశబ్దము నకును మూలస్థానము మూలాధారమనియు కులకుండలినీ రూపమున సుప్తమైయున్న చిచ్ఛక్తియే శబ్దరూపమున నభివ్యక్తమగుచున్నదనియు వీరి అభిప్రాయము నాదప్రవృత్తి సర్వదా జరుగుచుండుననియు, ప్రతి ఉచ్ఛ్వాసనిశ్వాస కర్మయందును ప్రాణి "హమ్, సమ్" అను అస్పష్టములగు రెండుధ్వనులను చేయు ననియు వివరింపబడియున్నది

ఈశబ్దోత్పత్తి విషయమున మన ప్రాచీనులు కాయాగ్ని కిచ్చినప్రాధాన్యము గమనింపదగినది దేహాంతర్భాగమునం దగ్ని

కలదనియు నిదియే శక్తిరూపమున వ్యక్తమగుచున్నదనియు శాస్త్రీకుల అభిప్రాయము మూర్తిమంతమగు నగ్నియే ప్రపంచమనియు నొక అభిప్రాయము ప్రతివస్తువుయొక్క సారమును అగ్నియని ప్రాచీనపాశ్చాత్యశాస్త్రీకులలో కొందరు నమ్మినారు పరమాణువునందు నిహితమైయున్న అవధిలేని శక్తినిబట్టి వస్తుతత్త్వము శక్తియని చెప్పవచ్చునని తోచుచున్నది ఈతత్త్వమునే ప్రాచీను లగ్నిశబ్దములచే వ్యవహరించిరన్నచో వారియభిప్రాయము నేటి శాస్త్రవిజ్ఞానముతో సమన్వయింపగలదు శబ్దోత్పత్తియందు మొదట నీకాయాగ్ని మనస్సుచే ప్రేరితమై నాభిప్రదేశమునందు నిహితమైయున్న అంతరవాయువునకు ప్రేరకమగుచున్నదనియు నట్లు ప్రేరితమైనవాయు వూర్ధ్వముగ ప్రసరించి క్రమముగ ధ్వనిరూపమును బొందుచున్నదనియు వర్ణితమైయున్నది ప్రాణిప్రపంచముయొక్క చైతన్యమునకంతకును నీయగ్నియే మూలమని ప్రాచీనుల అభిప్రాయము మనస్సుయొక్క తురీయాంశమే వాక్కనియు నది దేహస్థితమగు జ్యోతిర్మయాగ్నిసాహచర్యమున భాసించునదనియు ఛాందోగ్యోపనిషత్తు తెలుపుచున్నది

"వాగేవ బ్రహ్మణశ్చతుర్థఃపాదః
సోఽగ్నినా జ్యోతిషా భాతిచ తపతిచ

వాక్కు మనస్సుయొక్క సాహచర్యమును బొందియుండునని వేదాంతులవారి అభిప్రాయము వాక్కనేయుయును మనస్సు తన భావమును వ్యక్తముచేయుచుండుటచే వాక్కు అంతరంగమును సాధనమును నగును వాక్కు తేజస్సుచే శబ్దోద్యుక్తి మగుటయేకాక అగ్నియొక్క సాహచర్యముచే వ్యక్తితను స్పష్టతను వందుచున్నది తేజోవివర్తమే వాక్కని భర్తృహరీత్యాదుల అభిప్రాయమైనట్లు తోచుచున్నది

మనస్సుయొక్క ప్రేరణ కారణముగా అగ్నియు వాయువును శబ్దోత్పత్తియందు ప్రవర్తించుచున్నవి సమస్తమగు జ్ఞానమునకును ఆత్మమనస్సంయోగము ప్రథమమగు ఉపాధి అనగా మనస్సున నాత్మతో సంయోగము కలిగినవేకాని ప్రత్యభిజ్ఞానమే సాధ్యముకాదని అర్థము మనఃప్రవృత్తియే వాగుద్దీపకమై వాగింద్రియములను ప్రవర్తింపజేయుచున్నది భావము వాక్యముగ వ్యక్తమగుటలో అంతఃసన్నివిష్టమైన బ్రహ్మచైతన్యశక్తి ప్రకటమగుచున్నదని వాక్యపదీయవ్యాఖ్యాత తెలుపుచున్నాడు మనస్సు వాగుత్పత్తియందు సాధనముమాత్రమే కాదు మనస్సుయొక్క పరప్రతిబింబమే అంతరంగభాషయని శబ్దబింబములరూపమున వక్తయొక్క అంతరంగము ఆవిష్కృతమగుచున్నది దీనిని బట్టియే భాష మానసికప్రవృత్తి యని మనస్తత్త్వవేత్తలు నిర్ణయించినారు



భాషోత్పత్తి భాషాపరిణామములను, ప్రాచీన భాషాస్వరూపమును తెలిసికొనుటకై యూరోపుదేశీయులను ఎక్కువ కృషిచేసినారు గ్రీకులు శబ్దార్థసంబంధమునుగూర్చి విచారణగావించిరట్లు ప్లేటో రచించిన క్రేటిలాస్ అను రచనవలన తెలియుచున్నది భాష స్వాభావికసిద్ధమైనదనియు కల్పితమనియు రెండువాదము లాకాలమున వ్యాప్తియందుండినవి భాషను వ్యాకరించి (వాక్యమును పదములుగా విభజించి) విమర్శింప నారంభించినవాడు అరిస్టోటిలు అని చెప్పవచ్చును భాషాభాగములు విభక్తి—అను నభిప్రాయములను మొదట ప్రతిపాదించినవాడితడే భాషావిషయక పరిశోధనకై అలెగ్జాండ్రియాలో కొన్ని సంస్థ లేర్పడినవి కాని, వీరిపరిశోధనయంతయు పూర్వకవుల కావ్యముల అర్థనిర్ణయమునకు మాత్రమే ప్రయుక్తమైనది కావున భాషోత్పత్తిపరిణామములను గురించి ఎక్కువగా కృషి జరుగలేదనియే చెప్పవచ్చును

మధ్యయుగమున జరిగిన సారస్వతపునరుజ్జీవనము లాటిను భాషాధ్యయనమున కెక్కువ దోహద మొనర్చినదేకాని, భాషాతత్త్వ భాషాపరిణామములను గూర్చిన పరిశోధనను పెంపొందింపలేదు మతమునకును సంస్కృతికిని లాటినుభాషతో నెక్కువ సంబంధమున్నందున కారణమున ఆభాష మిక్కిలి గౌరవపాత్రమై, యున్నతవంశమువారిచే నభ్యసింపబడుచువచ్చినది సిసిరో రచనల అతని శైలి ఎంతయు నాదర్శమైనది అతనిశైలి ననుకరించుట నాగరికతకు లక్షణమని పరిగణింపబడినది అట్లే హీబ్రూభాష దేవభాష యను కారణమున పండితు లాభాష నభ్యసించినారు భాషలన్నియు హీబ్రూ జన్యములనెడి అపోహకారణముగా నితర భాషలందలి శబ్దముల కెల్లను తజ్జన్యములని నిరూపించుట కాకాలపుపండితులు ప్రయత్నించినారు హీబ్రూభాషను కుడినుండి యెడమకు వ్రాయుదురు తక్కిన భాషల వ్రాత తద్భిన్నమార్గము ననుసరించుచున్నది దీనినిబట్టి హీబ్రూజన్యములగు పదము లితరభాషలలో తారుమారైయుండవచ్చునని అపోహపడి ఆభాషలందలి పదములను వ్యత్యస్తము చేసియైనను హీబ్రూశబ్దములతో ముడిపెట్టుటకు ప్రయత్నించినారు భాషావిషయకమగు పరిశోధనయంతయు నిట్టి తప్పుత్రోవలో నడచినది

ఇదికాక లాటినుభాష పండితాదరమును ప్రభుత్వాదరమును బడసి పాఠశాలలందు ప్రధానస్థానము నాక్రమించుటతో దేశభాషలు మరుగుపడినవి వ్యవహారమునందున్న జీవద్భాషలు విస్మృతములైన కారణమున భాషాచరిత్ర తెలియుటకు అవకాశము లేకపోయినది లాటినువ్యాకరణబోధ పాఠశాలా ప్రణాళికయందు ముఖ్యవిషయమైనది మాతృభాష వెనుకబడినది ఇతరభాషలను తరువాతికాలమున వ్యాకరించుటలోకూడ లాటినువ్యాకరణ ప్రక్రియయే ఆదర్శమైనది వ్యాకరణ ప్రణాళికయంతయు లాటిను మార్గముననే నడచి

కి స్నై ర

వని భాషల సజాతీయత, విజాతీయత యను విషయము లేమాత్రమును గమనింపబడలేదు లాటినుభాషను బోధించుటలో కూడ గ్రంథస్థశబ్దరూపములు మాత్రమే గృహీతములైనవి ఉచ్చారణావైవిధ్యముచే నేర్పడి వ్యవహారమునందున్న భిన్నరూపములను పండితులు గమనింపలేదు ధ్వనుల స్వరూపము ధ్వని మార్పులు మున్నగు భాషాసహజవిషయములకంటెను లిఖితమగు నక్షరస్వరూపమునకు ప్రాధాన్యము కలిగినది ఈకారణమున భాషాపరిణామ విధానమును గమనించుట కవకాశమే లేకపోయినది

లాటినువ్యాకరణమును నేర్పుటలో కూడ వీరు భాషాశాస్త్రవిధానమును పాటించలేదు శబ్దస్వరూపము ప్రయోగములు నెట్లేర్పడినవో రూపభేదము లేర్పడుటలో గల కారణములెవ్వియో— యను విషయములను వివరించుటకుబదులు పదరూపకల్పన సుశబ్దాపశబ్దనిర్ణయములు ప్రధానములుగ వివరింపబడినవి తమకు ప్రమాణములని తోచిన కవుల ప్రయోగములనుమాత్రమే సుశబ్దములని నిర్ణయించి వానిని నేర్పుటయే వ్యాకరణబోధగా వారు పరిగణింపబడినది అనగా, వ్యాకరణము భాషకు వివరణమగుటకు మారుగ శాసనముగ సిద్ధించినది వివరణశాస్త్రమగుటకు బదులు వ్యాకరణము విధిశాస్త్రమైనది వ్యవహారస్థమగు జాతీయత నేమాత్రమును వైయాకరణులు గమనింపలేదు కొన్ని రూపములుమాత్రమే సరియైనవని గ్రహించి వానికిసూత్రములు రచించుటవలన తక్కిన ప్రయోగములు భాషాసహజములే యైనను విరసింపబడినవి లాటిను భాషాప్రయోగములు వ్యాకరణవిధానములు ఇతరదేశభాషలకుకూడ నాదర్శములు నికషోపలములు నైనవి

నిఘంటువుల రచనకూడ కృత్రిమమార్గమున నడచినది నిత్యవ్యవహారమునందున్న శబ్దములు గ్రహింపబడలేదు కావ్యములందలి ప్రయోగములలోకూడ నన్నియు నిఘంటువులలో చేరలేదు నిఘంటు రచయితలకు నచ్చినవి వారు శిష్టములు కావ్యయోగ్యములు నని తలచినవి మాత్రమే గృహీతములైనవి ఈ కారణముల వలన భాషావిషయకమగు పరిశోధన శాస్త్రీయమార్గమున నడవలేదు

పదునెనిమిదవ శతాబ్దమునందుండిన రూసో యను ఫ్రాను దేశ పండితుడు మానవులు ప్రయత్నపూర్వకముగ భాష నేర్పరచుకొన్నారని యూహించినాడు అంతవరకు భాషయే లేనివారు పరస్పరము సంప్రతించుకొని భాష నేర్పరచుకొనుట యెట్లో యతడు యోచింపలేదు. మానవజీవితమునందలి అవసరమును బట్టి అంతరంగికమగు ప్రేరణ కారణముగా భాష క్రమముగ పరిణమించియుండునని Herder సూచించినప్పుడే భాషావిషయమున చారిత్రకదృక్పథము ఏర్పడినదని చెప్పవచ్చును వ్యావహారిక భాషలను, పామరజనవ్యాప్తమైన గేయసారస్వతమును గమనింపనిచో భాషాస్వరూపపరిణామము బోధపడదని గుర్తించినవారిలో Herder ప్రథముడు ఇతని అభిప్రాయములను తరువాతివారును అనుసరించినారు

భాషయందు మానవుని శేముషీవైశిష్ట్యసారస్యము వ్యక్తమైయుండునని Tensch అను భాషాశాస్త్రజ్ఞుడు పలికినాడు ఆయాజాతుల మనస్తత్వము ఆయా భాషలలో వ్యక్తములగుచున్నవి భాషను పరిశీలించుటలో దాని ప్రధానగుణములగు శబ్దసంపద భావవ్యక్తీకరణ శక్తి స్పష్టత శ్రావ్యత అనువానిని ముఖ్యముగా గమనింపవలెను శబ్దసంపదను పరిశీలించుటలో భౌతికవస్తువులను భావవాచకములను సూచించు శబ్దములసంఖ్యాప్రమాణము కాదు నూతన భావములు ఏర్పడుట ననుసరించి శబ్దోత్పత్తికి తగిన సౌకర్య మెంతవరకు భాషయందు కలదు అను విషయమే యిందు ప్రమాణము పదముల కూర్పులో గల సారళ్యము అశ్లిష్టత ప్రత్యయరాహిత్యము జాతీయశక్తి స్వతంత్ర రచయితల [illegible]శక్తి—ఇవియిట్టి భాషాశక్తి నిర్ణీతమగును క్రమబద్ధము సహజము నగు వాక్యరచన వ్యాకరణవిషయమున సారళ్యము వ్యవహారవ్యాప్తమగు శబ్దజాలము—మున్నగునవి భాషాస్పష్టతకు హేతువులు వర్ణముల కూర్పునుబట్టి శ్రావ్యత సిద్ధించుచున్నది ఈ వివిధలక్షణములను పురస్కరించుకొని భాషను పరిశీలింపవలసియుండునని Jensch సూచించినాడు

చారిత్రక పద్ధతి ననుసరించి భాషను పరిశీలించు విధానము పందొమ్మిదవ శతాబ్దమున రూపొందెనని చెప్పవచ్చును సంపూర్ణ చైతన్యముతో నొప్పు ప్రాణిజీవితపరిణామక్రమమును అన్వేషించు విధమున భాషాపరిణామమును పరిశీలింపనారంభించుటతో భాషాశాస్త్రము వృద్ధికివచ్చినది ప్రత్యేకముగ నొకభాషను కేంద్రముగ నిడికొని భాషలనన్నిటిని దానితో నన్వయించెడు పాతపద్ధతి తప్పని గ్రహింపబడినది భిన్నభాషలందలి శబ్దజాలము పదముల కూర్పు వాక్యరచనావిధానము జాతీయప్రయోగము శాబ్దికములగు మార్పులవలన దెలియనగు [illegible] —మున్నగు విషయములలో సాదృశ్యముగల భాషలనన్నిటిని సమగ్రముగ పరీక్షించి సజాతీయ విజాతీయ భాషావర్గముల నేర్పరచు ప్రయత్నము జరిగినది సంస్కృతభాషాసాహాయ్యముచే భాషావిషయక పరిశోధనలు సక్రమమార్గమున నడవజొచ్చినవి వివిధభాషలయందు కాలక్రమమున నేర్పడిన మార్పులనుబట్టి భాషాపరిణామవిధానము తెలియుట కవకాశమున్నది ఈ చారిత్రకవిధానము ననుసరించి భాషయొక్క పూర్వాపూర్వరూపములను గ్రహించుచు పోయినచో భాషయొక్క ఆదిమరూపము గ్రాహ్యమగునని తలంచి కొందరు భాషాశాస్త్రజ్ఞులు కృషిచేయ నారంభించినారు Schleicher అను పండితు డీవిధమున మూల ఆర్యభాషాస్వరూపము నేర్పరచుటకుకూడ ప్రయ

త్నించినారు భాషోత్పత్తివిగాని, భాషా ఆదిమస్వరూపమునుగాని యీ ప్రయత్నములచే గ్రహింపగలుగుదుమనుట కల్ల భాష యెన్నడును తర్కబద్ధముగ నడవదు ఏ ప్రాణిప్రవృత్తియు తర్కబద్ధమైయుండదు సాదృశ్యబాహుళ్యమునుబట్టి యేర్పరచిన ప్రతి సూత్రమునకును విరుద్ధము లనేకములుండును కనుక నొక భాషా యుగమున నొకశబ్ద మొకవిధమగు మార్పునకు లోనైనచో, తత్పూర్వయుగమునకూడ నట్టి మార్పునకుగాని లేదా, తత్సదృశమగు మార్పునకుగాని లోనైయుండునని నిశ్చయింపలేము అట్లు మనము చేయు నిర్ణయములు చాలవరకు మన యూహపై నాధారపడియుండుననుట మరవరాదు లిఖితగ్రంథములు వ్యవహారమున వ్యాప్తిలోనున్న గేయాదులు శాసనములు —మున్నగు భాషాసంబంధములగు నాధారము లెంత పూర్వపువి మనకు లభింపగలవో యంతవరకును మనము భాషాస్వరూపమును ఇదమిద్ధమని నిర్ణయింపగలము భాషాశాస్త్రసిద్ధాంతముల ననుసరించి అంతకంటెను పూర్వము ఒకటి రెండు యుగములవరకును గల భాషాస్వరూప మెట్టిదైయుండునో కొంతవరకు ప్రదర్శింపగలము అంతియేకాని భాషాప్రాథమికదశ యిట్టిదని సిద్ధాంతము చేయజాలము జనను భాషాశాస్త్రజ్ఞులు ప్రతిపాదించిన పూర్వోక్త సిద్ధాంతములనన్నిటిని సమీకరించి యొక నక్రమపద్ధతి ననుసరించి విచారణ గావించినచో ప్రాచీనభాషాతత్త్వము కొంతవరకు గోచరముకాగలదు ఇట్టిపద్ధతినే "ఏసపర్ సన్" మున్నగు నవీను లవలంబించియున్నారు ఈ విచారణకు ముఖ్యముగ మూ డాధారములు గలవు మొదటిది శిశుభాష రెండవది అనాగరికజనుల భాష, మూడవది భాషాచరిత్ర

వ్యక్తిజీవితపరిణామము జాతిజీవితపరిణామమును చాలవరకు ననుసరించునని ప్రాణిశాస్త్రజ్ఞుల నిర్ణయము దీని ననుసరించి వేలకొలది శతాబ్దములలో జాతి పొందిన దశావస్థలనన్నిటిని గర్భస్థపిండము సమగ్రశిశురూపమును దాల్చుటలో పొందుచున్నదని నిర్ణయమగుచున్నది ఈ ప్రకృతివిధానమునుబట్టి చూచినచో భాషాపరిణామముకూడ నీమార్గము ననుసరించి యుండునని పలువు రూహించినారు మానవజాతి భాషను వృద్ధిపరచుకొనుటలో ననుసరించిన విధానమంతయు శిశువు భావవ్యక్తీకరణము సందర్భములందు వాగింద్రియప్రవృత్తియందు ప్రతిబింబించునని వీరి అభిప్రాయము భాషాప్రాథమికావస్థకును శిశుభాషప్రాథమికావస్థకును సాదృశ్యముండునని యీ అభిప్రాయఫలితము కావున భాషను అలవరచుకొనుటలో పిల్లలనుసరించు విధానమును సూక్ష్మముగ పరిశీలించుచో భాషోత్పత్తివిధానము గ్రహింపనగునని వీరి ఆశయము కాని యిట్టి విచారమున పొరపాటొకటి జరుగుచున్నది సిద్ధమై వ్యవహారమునందున్న భాషను పిల్లలు మొదటినుండియు వినగలుగుచున్నారు పెద్దల సంభాషణను విని పిల్లలు వారి ననుకరించి భాష నలవరచుకొన్నారు కావున భాషయే లేని ఆదిమకాలమున మానవుడు భాషార్జనలో ననుసరించిన విధానమునకును శిశువుల భాషార్జన విధానమునకును సామ్యముకాని సాదృశ్యముకాని కుదురదు వేరు శిశుజీవిత పరిధియందుండు ప్రతివస్తువునకును ప్రతి వ్యాపారమునకును ధ్వనిరూపమగు వాచకమొకటి సిద్ధమైయున్నది పెద్దల సంభాషణను వారి బాహ్యప్రవృత్తిని శిశువు సర్వదా ఇంద్రియములచే గ్రహించుచున్నది ఈవ్యవస్థ కారణముగా వాచకవాచ్యముల సంబంధము ప్రయత్న మెక్కువలేకనే శిశువు గ్రహింపగలుగుచున్నది మానవుని ప్రాథమిక జీవితపరిస్థితులు వేరు ఇతరుల సహాయముకాని అనుకరించు నవకాశముకాని లేక, ఆదిమమానవుడు అంతరంగికప్రాబల్యమున భాషను క్రమముగ వికసింపజేసికొన్నాడు కనుక భాషోత్పత్తిని తెలిసికొనుటయందు శిశుభాష మన కాదర్శముకాజాలదు పరిసరవాతావరణమునుండి భాషాచిహ్నములను శిశువు గ్రహించి తన వాచకావయవముల శక్తికనుగుణమగు శబ్దరూపముల నేర్పరచుకొనుచున్నది శిశువు చేయునది యనుకరణమేకాని భాషాసృష్టి కాదు ప్రస్తుతకాలమునందున్న శిశుజీవిత పరిస్థితులు వేరు ఆదిమమానవుని జీవితపరిస్థితులు వేరు లక్షలకొలది సంవత్సరముల పూర్వసంస్కారము శిశుజీవితమునందును సంఘమునందును స్థిరపడియున్నది ప్రయత్నపూర్వకముగ శిశువునకు భాషనుకూడ బోధించుచున్నాము భాషను నేర్చుకొనుటకై శిశువు ప్రజ్ఞానిబద్ధముగ ప్రయత్నముకూడ చేయుచున్నది కనుక శిశుభాషావికాసవిధానమునుబట్టి భాషోత్పత్తిదశావికాసములను నిర్ణయింప వీలులేదు, జనన ఒక సంవత్సరమువయస్సు లోపుగానున్న పిల్లలచేయు ధ్వనులను గమనించుట కొంత లాభకారి కావచ్చునని ఎస్పర్ సన్ అభిప్రాయము కాని అవయసులోనున్న శిశువు భావవ్యక్తీకరణమునకై ప్రయత్నించుచున్నదా, లేక ఆంతరంగిక చైతన్యము ధ్వనిరూపమున నాభ్యంతరముగ వ్యక్తమగుచున్నదా యనుప్రశ్న కలుగుచున్నది మనోవికాస మింకను కలుగని పసిపాపల యవస్థ చాలవరకు జంతువుల యవస్థకు సదృశమైనదని చెప్పవచ్చును కావున పసిపాపలుచేయు అవ్యక్తములు సంకల్పరహితజన్యములు నగు ధ్వనుల పరిశీలనవలన భాషోత్పత్తివిధానము తెలియుననుట సందేహాస్పదము

మూకవారు వ్యవహరించు విధానమునుబట్టి భాషోత్పత్తి విధానమును గ్రహింపగల మను నభిప్రాయముకూడ సరియైనది కాదు ఇంద్రియలోపము కారణముగా మూగవారు భావవ్యక్తీకరణమున కేవో ధ్వనులను అంగవిక్షేపములను నుపయోగింతురు. జనసము చేయు వాగింద్రియచలనమును, మనప్రవృత్తిని గమనించు నవకాశము వారి కున్నది ఆదిమమానవుల జీవితమునకును మూగ

వారి జీవితమునకును సాదృశ్యములేదు సర్వేంద్రియపూర్ణులైన సామాన్యమానవులు సహజముగ తమయందువిహితమైయున్న భాషాసామర్థ్యమును క్రమముగ వికసింపజేసి కొన్న విధానమును మూగవారి ప్రవృత్తియందు చూచుటకు సాధ్యముకాదు

వివిధభాషావర్గములకుచెందిన మాటలురాని పసిపిల్లల నొకచోచేర్చి, యెట్టిభాషనుకూడ వారు వినకుండునట్టి పరిస్థితుల నేర్పరచిచో ఆపిల్లలు తామై యేవిధమగు భాషను వ్యవహరింతురో గమనింపవచ్చుననియు, దానివలన భాషోత్పత్తివిధానము గ్రహింపనగుననియు నొక సూచన గలదు ఈజిప్టుదేశప్రభువు ఇట్టి ప్రయోగమునే యొకసారి చేసెనని తెలియుచున్నది కాని యిదికూడ ప్రయోజనకారి కాజాలదు ఇప్పటి శిశుజీవితములో ననేకశతాబ్దముల భాషాసంస్కారము పరంపరాగతముగ విహితమై యున్నదని గమనింపవలెను ఇట్టి ఉపచితసంస్కార కారణముగ ఈ శిశుసంఘమునం దేవో కొన్ని ధ్వనిరూపములు వ్యవహారోపయోగములై, యేర్పడవచ్చును వీనినిబట్టి ఆదిమమానవుని భాషాప్రాథమికస్వరూపమును గ్రహించుటకు వీలులేదు ఇదికాక ఈపిల్లలను పెంచు విధానముకూడ కృతకమై యున్నదనుట మరువరాదు ఆదిమమానవసంఘము ప్రకృతిమధ్య స్వచ్ఛందజీవితమును గడపినది, అప్పటి శిశువులు తమ మాతాపితరుల ధ్వనిసంజ్ఞలను నితర పశుపక్ష్యాదుల విరావములనుకూడ వినుచు ప్రకృతిప్రభావములకులోనై పెరిగినారు అట్టి పరిస్థితులలో నిప్పుడు పసిపిల్లలనుంచి వారియందు గలుగు భాషావికాసమును గమనించుటకు సాధ్యముకాదు కావున, ఈ పద్ధతియును సహాయకారి కాజాలదు

మూలభాషలు అని వ్యవహృతములగు ప్రాచీనభాషలను పరిశీలించుటవలన ప్రాథమికభాషాస్వరూపమును భాషోత్పత్తివిధానమును గోచరములగుననుటకూడ సందేహమే మనము ప్రాచీనములని పిలుచు భాషలన్నియు కొన్నివేల సంవత్సరములపూర్వము వ్యవహారమునందుండినవియేకాని అవి ఆదిమభాషలు కావు ఈ భాషలు నేడు వ్యవహారమునందున్న భాషలకంటెను భిన్నములుగ నుండుట నిజమే ఈ భిన్నతాపరిశీలనవలన భాషాపరిణామవిధానము బోధపడగలదేకాని భాషోత్పత్తిభాషాస్వరూపములు గ్రాహ్యములు కాజాలవు

అట్లే అనాగరకజాతుల భాషాపరిశీలనము కూడ నిందులకు ప్రయోజనకారికాదు ప్రాథమికభాషావస్థకు వీరిభాష నాగరకభాషలకంటెను నెక్కువ సన్నిహితమనుట నిజమే వారి భాషాస్వరూపము కొంతవరకు ప్రాచీనభాషాస్వరూపమునకు సూచకము కాగలదేకాని భాషోత్పత్తిసూచకము కాజాలదు అనాగరకజాతులవారి భాషాస్వరూపముకూడ అనేకశతాబ్దములనుండి పరిణమించుచు నేర్పడిన రూపమే యగుటచే నది ఆదిమభాషాస్వరూపముకంటె భిన్నమగుట తప్పదు కొన్ని అనాగరకభాషలలో నత్యంతమగు సంశ్లిష్టత కొన్నిటిలో నత్యంతమగు సారళ్యము — ఈ రెండులక్షణములును కన్పడుచున్నవి నాగరక అనాగరకభాషలకు భేదము భాషాసంపదయందే కలదుకాని ఉత్పత్తివిధానమున కాదు భాషాభావములకు గల సంబంధమును ఆభాషలు తెలుపగలవేకాని భాషోత్పత్తిని తెలుపలేవు

పాశ్చాత్యభాషాశాస్త్రజ్ఞులు భాషాపరిశోధన యందవలంబించునది చారిత్రక విధానము ప్రస్తుతము వ్యవహారమందున్న భాషలను పూర్వగ్రంథములందుమాత్రమే నిలిచియున్న సంస్కృత లాటినువంటి భాషలను కూడ గ్రహించి వానిలో సజాతీయములైన వాని నొకవర్గముగాజేసి ఆవర్గమునందు నవీనములైనవానిని తత్పూర్వపువానితో పోల్చిచూచినచో భాషారూపము లెట్లు మారుచువచ్చినదియు తెలియగలదు హిందీ మరాఠీ బెంగాలీ గుజరాతీ మున్నగు భాషలను ద్వితీయ ప్రాకృత కావ్యసంస్కృతములతోను, ద్వితీయప్రాకృతములను ఆదిమప్రాకృతవైదిక సంస్కృతములతోను పోల్చుటవలన ఇండోఆర్యభాషాపరిణామము గ్రాహ్యము కాగలదు ఇట్టే నేటితెలుగుభాషను పదమూడవశతాబ్దపు భారతభాషతోను శాసనములందలిభాషతోను దానిని పదియవశతాబ్దపు పూర్వశాసన భాషతోను పోల్చిచూచినచో తెలుగుభాషాపరిణామవిధానము తెలియగలదు ఈపద్ధతివలన ప్రాచీనభాషాస్వరూపము కొంతవరకు బోధపడగలదు అనేకములగు భాషాకుటుంబముల నిట్లు పరీక్షించినచో భాషాపరిణామమునుగూర్చిన సూత్రములు కొన్ని యేర్పడగలవు శాస్త్రపద్ధతి నట్టి భాషాసూత్రముల నేర్పరచుకొని, వానిని భాషాసామాన్యమునకు వర్తింపజేసి వెనుక కన్వేషించుచుపోవుటయే చారిత్రకపద్ధతి [మానవవంశశాస్త్రమునగూడ నిట్టి చారిత్రకపద్ధతియే అనుసరింప బడుచున్నది] భాషయందలి మార్పులను గమనించుటలో భాషకుచెందిన సకలభాగములను పరిశీలింపవలసియున్నది ఈపద్ధతివలన నీక్రింది యంశములు వ్యక్తములైనవి

ప్రాచీనభాషలలో క్లిష్టములు సంశ్లిష్టములునైన ధ్వనులెక్కువగ నుండినవని పరిశీలనవలన తెలియుచున్నది సంకీర్ణత నుండి అసంకీర్ణతకు పరిణమించుట భాషాలక్షణమని తోచుచున్నది ప్రాచీనభాషలో పదములు దీర్ఘములు సంశ్లిష్టములు నైయుండి, రానురాను సారళ్యమును బొందినవి కఠినోచ్చారణగల ధ్వనులు సరళములగు సజాతీయధ్వనులుగమారుట సంశ్లిష్టధ్వనులు స్వరసాహచర్యమును బొంది విభాగమును బొందుట గమనింపవచ్చును. సరళధ్వనుల ఆదేశము, విప్రకర్షము మున్నగునవన్నియు నిట్లేర్పడినవియే

పదరూపములు కూడ పనేకములుండినవి లింగవచన విభ క్త్యర్థములన్నియు పదమునందే నిహితములై యుండుట చూడగా, సంపూర్ణభావబోధకమై మొదట వెలువడిన వాక్యమే కాలక్రమమున పద రూపమున గైకొన్నదను నభిప్రాయము కలుగుచున్నది. భావ మంతయు సంపూర్ణమగు ధ్వనిరూపమున వ్యక్తమగుటయే స్వాభా వికము. భావమునననుసరించి ధ్వనియు నొకప్పుడు దీర్ఘము సంశ్లిష్టమునై యుండకతప్పదు. కాలక్రమమున ప్రత్యేకములగు పదము లను చేర్చి, ప్రయత్నమూన వాక్యము నల్లువలవాటి వచ్చియుండును. సంఘజీవితమును భాషయు బాగుగ వృద్ధిచెందిన దశయందే యిట్టి పరిస్థితి కవకాశముండును. కావున ప్రయత్నపూర్వకమగు వాక్య రచన భాషయేర్పడిన చాలకాలమునకుగాని జరిగియుండదు.

అనియతత్వముకూడ ప్రాచీనభాషాలక్షణమని తోచుచున్నది. పదరూపము లొక క్రమమున నేర్పడియుండలేదు. బహువచన రూపములు, విభక్తిరూపములు, క్రియారూపములు నేర్పడుటలో విస్పటిభాషలలోనుండు క్రమము ప్రాచీనభాషలందు లేదు. ఈవిధ మున క్రమరహితమై యుండుటయే ప్రాచీనభాషాలక్షణమని తోచు చున్నది. ప్రాచీనమానవుని మనస్తత్వమే యిందులకు కారణమని చెప్పవచ్చును.

ఆరణ్యకజాతుల భాషలను పరిశీలించుటవలనకూడ ప్రాచీన భాషాలక్షణములు కొన్ని తెలియవచ్చుచున్నవి. అండమానుదీవు లందలి భాష అత్యంతసంశ్లిష్టమైనది. పదములలో మూలధాతు వనేకములగు ప్రత్యయాదులచే మరుగుపడియున్నది. ఆస్ట్రేలియా అమెరిందియను, ఎస్కిమోజాతుల భాషలన్నియు నిట్టివే. బాస్క్ భాష చాల సంశ్లిష్టము అగమ్యము అనుట కొక ఐతిహ్యము కలదు.

"ఈవ్" (Eve) అను ఆదిమస్త్రీని ప్రలోభపెట్టి మానవుని పతనమునకు కారకుడైన సేటను (Satan) శిక్షింపగోరిన భగ వంతుడు బాస్క్‌భాష నేర్చుకొనవలసినదిగా నాజ్ఞాపించి సేటను నాదేశమునకు బంపెనట. ఏడుసంవత్సరములైన పిమ్మట దేవుడు దయతలచి ఆ కఠినదండనను తొలగించి సేటనును తనయొద్దకు పిలిచెననియు, సేటను బాస్క్‌దేశపు సరిహద్దులను దాటీదాటక మునుపే తాను శ్రమించి నేర్చుకొన్న బాస్క్‌భాషనంతను మరచి పోయెననియు నైతిహ్యము. హాస్యప్రధానమగు నీకథచే బాస్క్ భాషాసంశ్లిష్టత చక్కగ వ్యక్తపరుపబడినది.

ప్రాచీనభాషలలో పర్యాయపదముల సంఖ్యకూడ ఎక్కువ. వారి మూఢవిశ్వాసములుకూడ నిందులకు కారణములై యుండ వచ్చును. కొన్నిసందర్భములలో కొన్నిపదములను పలుకుట శిష్ట సమ్మతము కాదని భావించుటయు, కొన్నిపదములకు రూఢియందు అమంగళార్థము సిద్ధించుట—ఇత్యాది కారణములచే పర్యాయపదములు వృద్ధియై యుండవచ్చును. నేడుకూడ, "ఏడు" అను సంఖ్యావాచకము రోదనవాచకమని కొందరు వర్తకులు ధాన్యాదులను కొలుచు నప్పుడు "ఆరున్నొకటి" యని వాడుదురు. అట్లే "చచ్చినాడు" అనుటకు బదులుగా "పోయినాడు", "స్వర్గస్థుడైనాడు" మున్నగు నవి యుపయుక్తము లగుచున్నవి. రాత్రివేళ దారమనుపదము నుచ్చరింప కిష్టపడక "మంగళకార్య"మనియు "మంగళ" శబ్దము నకు పర్యాయముగా "అంగారక" శబ్దమును వాడుటయు, శ్రోత్రియు లలో ఆచారము పూర్వాచారములు, సంప్రదాయములు ప్రాధాన్యము వహించిన జాతుల భాషలలో అనవసర శబ్దము లెక్కువ.

అభివృద్ధిచెందిన భాషలలో భావవాచకములను జాతినిర్దేశక వాచకములను నేర్పడియుండును. మానవజీవిత ప్రాథమికదశలో ఏస్తునిర్దేశకవాచకములు క్రియావాచకములు ఉత్తమ మధ్యమాది సర్వనామములు ప్రధానములై యుండును. టాస్మేనియాదేశపు ఆనా గరకజాతులలో వివిధములగు చెట్లకు పేర్లున్నవికాని, జాతివాచక మగు కేవలం "వృక్ష"శబ్దమునకు సరియగు శబ్దములేదు. జూలూ జాతులలో వేరువేరు రంగుల ఆవులకు వేరువేరు పేర్లున్నవి కాని జాతివాచకమగు "గో" శబ్దమునకు సరియగు శబ్దములేదు. అట్లే మరికొన్ని జాతులలో అన్న తమ్ముడు చెల్లెలు అక్క అను నర్థములను దెలుపు పదములున్నవికాని సామాన్యమగు "సోదర" శబ్దములేదు. తెనుగున అన్న తమ్ముడు మున్నగు శబ్దములు ప్రాచీనములనియు "తోబుట్టువ"ను శబ్దము వానికంటె నర్వాచీన మనియు చెప్పవచ్చును. శిశుయేనియం జాతులలో ఒకేవిధమగు రంగును తెలుపుటకు, తత్తద్వస్తువులనుబట్టి వేర్వేరు శబ్దము లేర్పడినవి. క్రియావాచకముల విషయమునకూడ నిట్టిపరిస్థితియే కలదు. నేడు మన సంఘమునకూడ కొలతలు తూకములు దేశ దేశమునకును మండలమండలమునకును భిన్నములై యుండుటగను వింపవచ్చును. అదేవిధమున ప్రాణుల లింగభేదమును చూపుటకు వేరువేరు పదములుండుటకూడ ప్రాచీనలక్షణము. Ox—Cow Horse—Mare Dog—Bitch Gander—Goose ఎద్దు—ఆవు —ఇవి ప్రాచీనరూపములు. ఈ రూపము లేర్పడుటలో నేదియు క్రమవిధానము గోచరింపదు. He goat She goat, ఆడమేక మగ మేక పెట్టకోడి—పుంజుకోడి,—మున్నగు సక్రమరూప ములు అర్వాచీనములు. అట్లే, ప్రాణుల పిల్లలకుకూడ వేరు పేర్లుండుట ప్రాచీనలక్షణము. Dog—Pup Cat—Kitten Goat—Kid —ఇది క్రమరహితవిధానము. కుక్కపిల్ల పిల్లిపిల్ల కోతిపిల్ల ఏనుగుపిల్ల,—మున్నగు రూపము లెట్లు క్రమబద్ధములైయున్నవో గమనించునది.

కి ష్మె ర

వర్ణనాత్మకము ప్రాచీనకాలములో వృద్ధియగుటకు వారి జీవితమున భావావేశము ప్రాధాన్యమువహించుట కారణమైయుండవచ్చును. అనాగరకజనుల జీవితమున ఉద్వేగాదుల ప్రవృత్తి ఎక్కువయని వేరుగ గమనింపవచ్చును. సంఘమున జనుల సాహచర్యమునకుకూడ ప్రాచీనకాలమునం దెక్కువ అవకాశముండినది. సంఘము చిన్నదియగుటయు, సంరక్షణకై గుంపులుగ నేర్పడుటయు కారణములుగా జనులలో సాహచర్య మధికమైనది. సాహచర్య మెక్కువగుటచే రాగద్వేషాది ప్రవృత్తికికూడ అవకాశమెక్కువ. బుద్ధివికాసము లేనికాలమున ఆవేశమునకు ప్రాధాన్యమెక్కువ. ఈ కారణముననే కాబోలు ప్రాచీనకాలమున గేయము లెక్కువగ వృద్ధికివచ్చినవని కొందరి యూహ. గేయరచన యారంభమగుటతో భాష వర్ణన కుపయుక్తమైనది. వాచ్యార్థమును మించిన యితరార్థములను సాదృశ్యములను కల్పితములగుటకు గేయరచనయే కారణము. పామరజనము పనులలో నిమగ్నమైయున్నప్పుడే రాగములుతీయుట పాటలు పాడుట నిత్యము జరుగు సాధారణ విషయము. పడవ పాటలు కపిలెపాటలు కోతపాటలు దంపుడుపాటలు మున్నగునవి యిన్నియు నిట్టివే. ఒకప్పుడు పాటలరచనలో నుపయుక్తములైన పదము లర్థరహితములే యై యుండవచ్చును. భావము హృదయమునుండి పొంగి రాగరూపమున నిర్గమించునపుడే శబ్దము లాలంబనములగుచున్నవి. యువతీయువకుల ప్రణయగీతముల యుత్పత్తిని గమనించిన నీవిషయము వ్యక్తము కాగలదు. అదికాక బుద్ధివికాసము తక్కువగనుండి ఆవేగ మెక్కువగ నున్నపుడు వదరుబోతుతనము కూడ ఎక్కువ. చదువులేని స్త్రీజనమును అనాగరకజాతులును సదా ఎక్కువగ మాటలాడుచుండుట కిదియే కారణమని చెప్పవచ్చును. ఈ వదరుబోతుతనము కూడ శబ్దజాలము వృద్ధియగుటకు కారణమైయుండును. నీవన్నిటిని పరిశీలించి చూడగా భావవ్యక్తీకరణమాత్రమే భాషోత్పత్తికి కారణము కాదనియు నసేకములగు నితరజీవితవిషయములు కారణములైనవనియు విదితమగుచున్నది.

Condillac అను భాషావేత్త చెప్పినట్లు ఆదిమ స్త్రీ పురుషుల నిత్యవ్యవహారమున, స్వాభావికముగ నుచ్చరించిన ధ్వనుల నుండియే క్రమముగ భాష యేర్పడినదనుటయే సత్యము. వారుచ్చరించిన శబ్దములును వని బోధించిన యర్థములును తరువాతివారికి సంస్కారముగ సిద్ధించి భాషాభివృద్ధికి హేతువులైనవి. మానవుడు ప్రకృతిసిద్ధములైన తన శక్తులను సాంఘికావసరముల కనుగుణముగ నుపయోగించుకొన్నాడు. తత్ఫలితముగ నతనియందు నిహితమైయున్న భాషణసామర్థ్యము భాషోత్పత్తికి హేతువైనది. మానవజాతి పరిణామములో, మానవుని హస్తమును, వాక్కును ప్రధానపాత్ర వహించినవి. మానవ సృష్టియంతయు నీ రెండిటిపై నాధారపడినది. జీవితమే భాషోత్పత్తికిని భాషావికాసమునకును మూలము. మానసిక జీవిత ప్రవృత్తియే భాషయనవచ్చును. ఆదియందు ఆవేగకారణమున నిర్గమించిన అవ్యక్త నిరావమే క్రమముగ నిర్దిష్టార్థకాది క్రియాసంజ్ఞగ నేర్పడియుండును. మానవ జీవితపరిణామమందది ప్రధానఘట్టము. ఆత్మరక్షణ ఆత్మపోషణలును ఇతరప్రాణి వర్గముపై నధికార సంపాదనమును మానవునకు మొదటినుండియు నావశ్యకములైనవి కనుక మానసిక ప్రవృత్తి తీవ్రమై భాషాసాధనసృష్టికి హేతువైనది. స్వయంప్రవృత్తములైన నిరావములకు సంకల్పబలముచే సంజ్ఞాసిద్ధి కలుగుటయే భాషోత్పత్తికి మూలమని చెప్పవచ్చును. రాగభయమిత్యాది సందర్భములలో నప్రయత్నముగ మానవుని హృదయమునుండి నిర్గమించిన అరపులకును తత్కారణములైన రాగాది హృదయ ప్రవృత్తులకును గల సంబంధమునుబట్టి సంకల్పశక్తి. ఆ యరపులను వాటికి సంజ్ఞలుగా గ్రహించుట భాషోత్పత్తియందు మొదటిమెట్టు. ఈ ధ్వనులు వాచకసంజ్ఞలుగా మానవిక జీవితమున స్థిరపడుటకు జ్ఞాపకశక్తియు ప్రతిబోధశక్తియు కూడ సహకరింపవలెను. కనుక, ధ్వనులు వాచకసంజ్ఞలుగ నేర్పడునాటికే యీ రెండు శక్తులును (జ్ఞాపక ప్రతిబోధశక్తులు) వికసించియుండవలెను. ఇట్లేర్పడిన ధ్వనిసంజ్ఞలకు మానవుడు లక్షణకల్పన (Symbolic Significance) చేయునాటికి శక్తులు సంపూర్ణ వికాసమును గాంచినవి. ధ్వనులు భావలక్షణములుగ (Symbols) నేర్పడుటతో ప్రత్యక్షానుభూతితో నవసరములేకయే భావమును తెలుపు సౌకర్య మేర్పడినది. అప్పుడప్పుడే ప్రాదుర్భవించుచున్న బుద్ధిశక్తి ఆలోచనా వ్యాపారమునకు విశిష్టమగు సాధనముగ భాష నుపయోగించుకొన్నది. ప్రత్యక్షవస్తుసంబంధముతో నవసరములేకయే ఆలోచన ప్రవృత్తమగుటకు భాషను సమర్థమైన సాధనముగ చేసినది బుద్ధిశక్తి. శబ్దముల కిట్లు భావప్రాతినిధ్యమును, వ్యవహార యోగ్యతయు సిద్ధించినవి. కావుననే నేడు శబ్దములు నాణెములవలె వ్యవహారమున చెలామణియగుచున్నవి.

జీవితము, అవసరము వాంఛ ఇత్యాదుల మూలమున నుత్పన్నమైన భాష సంకలనమార్గమున నభివృద్ధిచెందుచున్నది. అవిభాజ్యము సంపూర్ణమునగు భావము భాషారూపమును గైకొన్నది. కనుక సంపూర్ణ భావమును వ్యక్తముచేయు వాక్యమే మొదట నేర్పడు భాషాస్వరూపము. వైయాకరణులు పేర్కొను పదములు వర్ణములు అనునవి వాక్యముయొక్క ప్రత్యేకాంగములు. వాక్యతత్త్వమును తెలిసికొనుటలో నవలంబించు వ్యవకలన విధానమే వ్యాకరణము. నిర్వచనందలి వైవిధ్యమునుబట్టి భాషయందు గలుగు మార్పులను భాష గైకొను

స్వరూపములును అనంతములు, అనియతములు భాష నియమములకు కట్టుబడి నడచునదికాదు భాష కాలక్రమాణము వేర్పరచినవారని పరిగణింపబడు మహాకవుల గ్రంథస్థభాషకూడ, స్వేచ్ఛగా ప్రకృతి సహజముగ ప్రవహించుచుండు భాషా జీవితశక్తి నడ్డుటకు సమర్థము కాకున్నది సంప్రదాయ శృంఖలములను విడుచ్చుకొని అప్రతిహతముగ ముందునకు పోవుటయే జీవితతత్త్వము భాషాపరిణామమున మనస్సునకే ప్రాబల్యమెక్కువ అర్థసిద్ధిని గలిగించుటకు మార్చుటకు నూతనపదములను సృష్టించుటకు, మనోవ్యాపారమే కర్త కావుననే ప్రపంచమునందెందరు వ్యక్తులుగలరో అన్నిభాష లున్నవనుట అతిశయోక్తి కాదని Vendryes పలికినాడు

వివాహము జీవితవిధానము జాతుల పరస్పర సంబంధము మున్నగు చారిత్రక వ్యవస్థలపై భాషాపరిణామ మాధారపడియున్నది సాంఘిక వర్గములుగా వ్యక్తు లేర్పడుట, ఒక వర్గము నుండి మరియొకవర్గమునకు పదములు వ్యాపించుట—మున్నగు విషయములు భాషలలోగలుగు అర్థభేదములకు కారణములు కనుక భాష పూర్తిగ సంఘనిష్ఠమైన యొక వ్యవస్థయేయైనను, భాషోత్పత్తికి సంఘమే హేతువని చెప్పుటకు వీలులేదని Henry Berr యొక్క అభిప్రాయము

భాషామూలతత్త్వము ప్రతిమానవుని చైతన్యమునందును నిహితమైయున్నదనియు, వ్యక్తిచైతన్యము సాముదాయకమగు సాంఘిక చైతన్యముయొక్క అంశమే యగుటచే భాష సాంఘిక సృష్టియనియు Vendryes యొక్క ఆశయము మానవ జీవిత ప్రకృతియు సంఘజీవితప్రకృతియుకూడ భాషోత్పత్తి భాషా వికాసములకు కారణములైనవని నిర్ణయించుటయే సమంజసమని చెప్ప వచ్చును

---


ఘనతవలననే అగ్రస్థానం




స్వీట్స్

పిల్లలకు
ఇవంటే
మహాప్రీతి




ఎం.ఏ.పి. ఇండస్ట్రీస్ మద్రాసు-21

# సవతి తల్లి

వై. బి. యస్. రెడ్డి

## 1

బ్యారిష్టరు సుధాకర్ భార్య కమల పరిస్థితి నానాటికీ క్షీణించుకుపోయింది. ఆకస్మాత్తుగా ఒక రోజున నాలుగు సంవత్సరముల బాలిక శైలాను, పన్నెండు సంవత్సరముల పుత్రుడు జనార్దన్‌ను తన భర్త చేతుల్లో ఒప్పగించి ఆమె ఈ లోకం విడిచిపెట్టింది.

బారిష్టరుగారింట్లో పిల్లలను చూసుకునేందుకు నౌకర్లు తప్ప మరెవ్వరు లేకపోయారు. చివరకాయన చాలాచూరము ఆలోచించి ఆ ఊళ్ళోనే ప్రసిద్ధవ్యాపారియైన రమాశంకర్ పుత్రిక సుశీలతో రెండవపెండ్లి చేసుకున్నాడు. సుశీల స్వభావం సుధాకరుడు తలచిన విధంగా లేకపోయింది. ఆమె ఆ పిల్లల విద్దరిని ప్రేమతో పెంచుతూ అడిగిన దల్లా వాళ్ళకి ఇస్తూండేది.

ఈవిధంగా సంవత్సరము గడిచింది. ఈలోపుగా సుశీల ఒడిలోకూడా ఒకబాలుడు ఏడ్వడం మొదలుపెట్టాడు. జనార్దన్ ఆ బాలుని చూడగానే నాతమ్ముడు రమేశ్ అని సంబోధించాడు. చివరికదేపేరు అందరి లోనూ వ్రాకిపోయింది. రమేశ్ కారణంగా జనార్దన్, శైలాలపై సుశీల ప్రేమ నానాటికి సన్నగిల్లిపోయింది. అదే మెల్లిగా ఈర్ష్యగాను, చివరకు శత్రుత్వంగాను పరిణమించింది.

## 2

ఒకరోజు జనార్దన్ స్కూలునుంచి యింటికి రాగానే సుశీల షరబత్ తయారుచేసి ఎంతో ఆప్యాయంగా దగ్గరకుపిలిచి "నాయనా! నీవు రోజురోజుకు చిక్కిపోతున్నావే! నీశరీరబలం అభివృద్ధి పొందేందుకు నేనొకమందు కొన్నాను రోజూ దాన్ని షరబత్తులో వేసుకొని త్రాగుతూయుండమని బుజ్జగిస్తూచెప్పింది. "సుశీల స్వభావంలో ఆకస్మాత్తుగా కల్గిన ఈపరివర్తనము జనార్దన్‌కు సందేహము కల్గించింది. అతడు కాళ్ళు చేతులు శుభ్రము చేసుకొనివచ్చి కూర్చున్నాడు. త్రాగబోతూ అతడు "అమ్మా! మరి కొంచెము చక్కెర కావాలని అడిగాడు." అనలే చాలా వేశాను మరీ తీపి బాగుండదని సుశీల అంది. అయితే జనార్దన్ పట్టు వదలలేదు. సుశీల చక్కెరకోసం వంటయింట్లోకి వెళ్ళింది. సుశీల యింట్లో కెళ్ళగానే జనార్దన్ ఆ గ్లాసును పుచ్చుకొని బయట కొచ్చాడు. అక్కడొక కుక్క కూర్చొని ఉంది. దానిముందు ఆ గ్లాసు పెట్టాడు. కుక్క సగము షరబత్తు కూడా త్రాగక పూర్వమే అరచి క్రిందపడి చచ్చిపోయింది. ఈ దృశ్యాన్నిచూచి జనార్దన్ విశ్చేష్టుడయ్యాడు. ఇక అక్కడ ఉండడం మంచిది కాదనుకున్నాడు. భవిష్యత్తుపై నీ భారంవేసి బయటకెళ్ళిపోయాడు. మరి ఇంటి ముఖం చూడదలచుకోకుండానే—సుధాకర్ జనార్దన్ను వెదకించాడు. లాభం లేకపోయింది. సుశీల దుర్వ్యవహారంచేతనే వెళ్ళిపోయి యుంటాడనితలచి నిట్టూర్పు విడిచి పూరుకున్నాడు.

జనార్దన్‌కు మద్రాసులో ఒక జడ్జిగారు ఆశ్రయమిచ్చారు. ఆయనకు సంతానంలేదు. జనార్దన్‌ని తన పుత్రుడులాగా భావించి యింట్లో వుంచుకొన్నారు. అతని చదువుకు కావలసిన అన్ని ఏర్పాట్లు చేశారు.

జనార్దన్ జడ్జిగారు ఆయన భార్య సుమిత్రల వాత్సల్యఛాయలలో చాలా ఆనందంగా కాలము గడుపుతున్నాడు. వారినే తల్లిదండ్రులుగా భావించి తన స్వగృహాన్ని మరచిపోయాడు. అప్పుడప్పుడు ఏకాంతంగా కూర్చొని సుమిత్రను సుశీలను తన తల్లితో పోల్చి చూసుకునేవాడు. అన్ని విషయాల్లో సుమిత్రే జనార్దన్‌కు శ్రేష్ఠురాలుగా కన్పించేది. సుమిత్రనే తల్లిగా భావించి—ఆదంపతులిద్దరను తన తల్లిదండ్రులే అనుకునేవాడు.

* * *

## 3

సుధాకర్ అంత్యక్రియలు, దినాలు యథావిధిగా గడిచాయి. మరుదినమే శైలాను సుశీల తన దగ్గరకు పిలిచింది.

"శైలా! అడ్వొకేట్ రామమోహన్‌ను చూచావా?" అని ప్రశ్నించింది.

"ఎవరా రామమోహన్?"

"ఈవేళ ఉదయం నాతో కాఫీ త్రాగుతున్న వ్యక్తి."

"ఆ! అవును ఏం?"

"ఏమీలేదు అతనితో నీవివాహం నిశ్చయించదలచాను" ఈమాటలు వినేటప్ప

టికి లైలా శరీరంపైన వెయ్యి జెఱ్ఱి లొక్కసారిగా ప్రాకినట్లనిపించింది భవిష్యత్తంతా అంధకారబంధురంగా కనబడిందామెకి

"ఆయన నా అన్నయ్య స్నేహితుడు చాలా మంచివాడు ఉపకారి అంటూ సుశీల చెప్పుకుంటూ పోతోంది ఇక లైలా తన క్రోధాన్ని ఆపుకోలేకపోయింది

"అయితే మీ అన్నగారిని సంతోష పెట్టేందుకు నా జీవితాన్ని ఆ వృద్ధుడికి బలియివ్వదలచుకున్నావా?

'పిచ్చెక్కిందా నీకు "

"కాకపోదు ఎప్పుడు నేనంత అతనిని వివాహం చేసుకోను ఈ వివాహాన్ని గురించి మాట్లాడదలచాను నేను సహించలేను "

"పెండ్లి చేసుకోవా?"

"అది నా యిష్టము నా కాగితమిచ్చెయ్యి "

"ఏం కాగితం

'అదే 10 వేల రూపాయల ప్రోనోటు మానాన్నగారు చచ్చిపోతూ నాపేర వ్రాసి నీకు ఒప్పగించిపోయిన కాగితం "

సుశీలకి ప్రాణమంతా కృంగిపోయిన క్రోధమంతా ఒక్కసారిగా వెళ్ళగ్రక్కింది

"నాదగ్గరేమీ కాగితాలు లేవు అని ముక్తసరిగా జవాబిచ్చింది

"సరే! నీ యీ దుష్కృత్యాలే ఏనాటికైనా రోజు ముంచకపోవు జాగ్రత్తగాయుండు"

"లైలా! జాగ్రత్త!! నా యిష్టానికి వ్యతిరేకంగా నడిచావా? జనార్దన్ గతే నీకు పడుతుంది "

"నాకంటే ముందు నీవే పోవలసివస్తుందేమో!"

జ్ఞాపకముంచుకోమ్మని లైలా వేగంగా గదిలోంచి వెళ్లిపోయింది

## 4

జనార్దన్ బారిష్టరీ పాసు చేసినపుడు జడ్జిగారి ఆనందానికి మేరలేకపోయింది మిత్రులు డిన్నరిచ్చారు బంధుమిత్రులనుండి అభినందనాలు తెల్పుతూ పెంపులెగిరెంది టెలిగ్రామ్‌లొచ్చాయి ఇప్పుడు అంతా జనార్దన్‌ను జడ్జిగారి పుత్రుడుగా భావించసాగారు ఆ దంపతులుకూడా అతన్ని పుత్రుడుగానే చూసుకొనేవారు

ఆనాటి సాయంకాలమే జనార్దన్ తన ప్రియమిత్రుడైన డాక్టరు రమేశ్‌తో కారులో షికారుకు బయలుదేరాడు రమేశ్ డ్రైవ్ చేస్తున్నాడు అకస్మాత్తుగా కారాగిపోయింది రమేశ్ క్రిందకు దిగాడు

"ఏమిటని' జనార్దన్ అడిగాడు ఇటు రమ్మని రమేశ్ సంజ్ఞ చేసినందున అతడు కారు దిగి రమేశ్ దగ్గరికివచ్చి నిలబడ్డాడు


కుట్టుపని బోధిని (తెలుగు)

Self Tailoring and Cutting Teacher

క్రొత్త పద్ధతిలో కత్తిరించి కుట్టు పాఠములుగలది ప్రతి పరి... ప్రింటు ముఖ్యము 92 పేజీలు 36 పటములుగల పుస్తకము రు 12 పోష్టు ఖర్చులు అ 6

చేతిపనుల వృత్తి రహస్య బోధిని

10 రూపాయలనుంచి 500 రూపాయలవరకు నెలకు సంపాదించవచ్చును ఇందు సబ్బు దినుసులు సెంట్లు అత్తరు హేరాయిల్స్ పప్పరమెంటు వార్నీస్ వర్ణములు పన్నీరు షర్బత్తు ఊదువత్తులు కర్పూరం సిరా దినుసులు గిల్టు యిచ్చేవిధము ఫోటో ఎత్తువిధము బాణసంచా మందులు సులభముగా తయారుచేయు పద్ధతులతో 100 పేజీలుగల పెద్ద పుస్తకము వెల రు 1-8-0 పోష్టుఖర్చు 6 అణాలు

మహారాజా పుస్తకశాల 12 అరుణాచలమొదలి వీధి మదరాసు


అక్కడ ఒక యువతి మూర్ఛపోయి క్రింద పడి ఉండటం చూశాడు రమేశ్ జనార్దన్ లిద్దరూ కలసి ఆమెను కారులో పడుకోబెట్టారు మూర్ఛతేరుకుంది

రమేశ్ డాక్టరు అవటంవలన వెంటనే ఆమెను తన డిస్పెన్సరీలో చేర్చుకుని యింజక్షనిచ్చాడు కొంచెంసేపటిలో ఆమె కళ్లు తెరచి చూసింది

"నీవిక్కడకుకూడా వచ్చావా? నన్ను బ్రతుకనియ్యవా? నన్ను చంపి శాంతిపొందదలచుకొన్నావా?" అంటూ గట్టిగా అరచి మరల మూర్ఛపోయింది డాక్టర్ రమేశ్ మరొక యింజక్షన్ ఇచ్చాడు ఆమె కళ్లు తెరచి "నేనెక్కడున్నానని" ప్రశ్నించింది

"మీరు నా డిస్పెన్సరీలో యున్నారు నేను డాక్టరు రమేశ్‌ని మీరు ఎక్కువ మాట్లాడరాదు విశ్రాంతి తీసుకోండి "

"డాక్టరుగారూ నాకు ఆకలివేస్తోంది మూడు రోజులనుండి నాకు తిండిలేదు "

వెంటనే డాక్టర్ రమేశ్ పండ్లు తెప్పించాడు ఆమె కొంచెం ఆహారం తీసుకున్న తర్వాత మంచంపైన కూర్చుంది ఇపుడామె బాగా ఆరోగ్యంగా కనబడుతోంది కొంతెం సేపయినతర్వాత ఆమె వారి పరిచయము అడిగింది

"నే నెవరినో మీకు ముందుగానే తెలియపరచాను ఇదిగో! ఈయన ఒక ప్రసిద్ధ బారిష్టర్—పేరు జనార్దన్ "

"మీపరిచయంకూడా తెలుసుకోవచ్చా?" జనార్దన్ అడిగాడు

"ఎందుకు తెలుసుకోకూడదు? నన్ను శశికళ అంటారు నేను నా సవతితల్లి పెట్టే బాధలు సహించలేక యింటనుండి పారిపోయి వచ్చాను ఆమె నన్నొక వృద్ధమృగానికి అంటగట్టడానికి ప్రయత్నించింది " ఇల్లా చెపుతుండగా ఆమె కండ్లలో నీళ్లు మెదలసాగాయి ఇక రమేశ్, జనార్దనులు

అక్కడ నిలువలేకపోయారు. ఆమెను విశ్రాంతి తీసుకొమ్మని బయటకొచ్చేశారు.

## 5

ఒకనాటి సాయంకాలం రమేశ్, జనార్దన్, శశికళ ముగ్గురు కలిసి ఒక పార్కులో తిరుగుతున్నారు. కొంతసేపయిన తర్వాత ముగ్గురు ఒక బెంచిమీద కూర్చున్నారు. వీరు కూర్చున్న పదినిముషాల్లో మరొక యువకుడు దగ్గరకొచ్చాడు. అతని చేతులో పుస్తకముంది. చూచేవారికి విద్యార్థి యని పించకమానదు. అతడు ఈ ముగ్గురి ఎదుట గల బెంచీమీద కూర్చున్నాడు.

దాదాపు అయిదు నిముషాలయిన తర్వాత అతడు విజిల్ వేశాడు. దగ్గరలోనే ఏదో డ్యూటీలోనున్న పోలీసులను పిలచాడు. వెంటనే ఇద్దరు పోలీసు లక్కడికి వచ్చారు. ఆ యువకుడు వారి చెవిలో ఏదో చెప్ప ముగ్గురు ఎదుటనున్న బెంచివైపు నడిచారు. కానిస్టేబిల్స్ తమ ఎదుట నిలబడటంచూచి రమేశ్, జనార్దన్, శశికళ తెల్లపోయారు.

జనార్దన్ ఏపనిమీద వచ్చారు అని అడిగాడు. ఆ వచ్చిన యువకుడు శశికళవైపు సాభిప్రాయంగా వేలుచూపిస్తూ "నేను మిమ్మల్ని జైలుకు పంపించడానికి వచ్చానని" జవాబిచ్చాడు.

"జైలుకా? ఎందుకు? మీరెవరు?" రమేశ్ గద్దించి అడిగాడు.

"మహాశయా! కోపపడిన లాభంలేదు. నేను సి. ఐ. డి. యిన్స్పెక్టరును. ఈమె తన వంటమనిషిని హత్యచేసి యిక్కడికి పారిపోయివచ్చింది. అందుకు తగిన ఋజువులు మాదగ్గరున్నాయి."

కానిస్టేబిల్స్‌కి ఆజ్ఞ యివ్వగా వారు ఆమె చేతులకు బేడీలు తగిలించారు.

"శశికళా! భయపడవద్దు. నిన్ను నే రక్షిస్తాను. వెళ్లు" అన్నాడు జనార్దన్.

శశికళను పోలీసులు తీసుకవెళ్లారు. వీరిద్దరుకూడా చింతాక్రాంతులై పార్కు బయటకొచ్చారు.

రెండవరోజు జనార్దన్ జడ్జిగారి సలహా తీసుకొని జామీనుకు అప్లై చేశాడు. కాని ఖూనీకేసు అవడంవల్ల జామీనుకు అనుమతించలేదు. కోర్టులో కేసు దాఖలయింది.

## 6

ఈవేళ శశికళ తీర్పుదినం. కోర్టు జనంతో కిటకిటలాడుతోంది. ఇసుకజల్లినను రాలనంతగ జనంవచ్చారు. యథాసమయానికి జడ్జిగారు వచ్చి తమస్థానంలో కూర్చున్నారు. శశికళ తన వాఙ్మూలం ఈవిధంగా ప్రారంభించింది.

"నేను విజయవాడలో సుప్రసిద్ధ వకీలు అయిన సుధాకర్ కుమార్తె లైలాను."

విసీవినడంతో జనార్దన్ ఆశ్చర్యానికి మేరలేదు. శశికళ తనసంగతి చెపుతూ పోతోంది.

"నాతల్లి నా బాల్యమందే మరణించింది. నా తోబుట్టువు జనార్దన్ నాతో ఉండేవాడు. మాతండ్రి రెండవ వివాహం చేసుకున్నాడు. మా సవతితల్లి పెట్టేబాధలు పడలేక నా అన్న జనార్దన్ యిల్లువిడచి వెళ్ళిపోయాడు.

"పదమూడు సంవత్సరాల తర్వాత మా తండ్రి చనిపోయాడు. ఆయన చనిపోవునపుడు తన వీలునామాలో నా జీవితాన్ని సుఖప్రదంగా గడుపుటకేమీ నాపేర వీలయినంత వ్రాసిపెట్టిపోయారు. నా తండ్రిదినాలు పూర్తి అయిపోవడంతో నా సవతితల్లి తన సోదరుని మిత్రుడైన ఒక ముసలాయనకు నన్ను అంటగట్టేందుకు ప్రయత్నించింది. కాని నేను సమ్మతించలేదు. ఆమె అనేక విధాల భయపెట్టింది. నీ అన్నగతే నీకు

వైబ్రో
గర్భాశయ రోగ నివారిణి
సుప్రసిద్ధ బలవర్ధ కౌషధము. సర్వవిధ బహిష్ట చిక్కులను పూర్తిగాబోగొట్టి సత్సంతానమును కలుగజేయుటలో మా వైబ్రో మిక్కిలి ఖ్యాతి వహించినది. అన్ని షాపులలో దొరకును. స్టాకిస్టులు: అప్పా అండు కో మద్రాసు.
కృష్ణా లేబరేటరీ, బెజవాడ.

పట్టేట్లా చేస్తానంది నేను ఒప్పుకోలేక పోయాను నా తండ్రి వ్రాసియిచ్చిన వీలునామా విస్మరించ ప్రాధేయపడ్డాను వీలునామా నీవు నాకివ్వలేదని జవాబిచ్చింది ఇక అక్కడ ఉండటం నా ప్రాణానికి ముప్పని తలంచి చేయునదిలేక ఒకనాటిరాత్రి యిల్లు వదలిపారిపోయాను నా పేరు శశికళయని మార్చుకొని ప్రస్తుతం డాక్టర్ రమేష్ బారిష్టర్ జనార్దన్‌గారి ఆశ్రయంలో ఉంటున్నాను ఈ హత్యనుగూర్చి నాకేమీ తెలియదు "

తన వృత్తాంతాన్ని చెప్పినతర్వాత పోలీసులు శైలాను తీసుకపోసాగారు ఈ దృశ్యాన్ని చూచి జనార్దన్ తన దుఃఖాన్ని ఆపుకోలేకపోయాడు "శైలా! నీ అన్న పదమూడు సంవత్సరాలక్రితం యింటినుండి పారిపోయాడు ఇపుడు నీఎదుటే నిలబడి యున్నాడు ఇక నీవేమీ భయపడనక్కరలేదంటూ" ఏడ్వడం మొదలుపెట్టాడు

అకస్మాత్తుగా తన సోదరుని చూడగల్గినందుకు శైలా తన సోదరప్రేమంతా పులికిపోయేటట్టూ విట్టూర్పువిడచి పూరుకుంది

7

మరునాటిరోజు ప్రతివాదిపార్టీ వకీలు తన ప్రమాణాలను కోర్టుఎదుట పెట్టాడు అతనివాదంయొక్క సంక్షిప్త సారాంశమిది

"శైలా యింటినుంచి పరుగెత్తిపోయిన దినమే పోలీసులకు ఆ యింటిలో వంటమనిషిశవము దొరికింది దీనివల్ల యిలా వయ్యేదేమంటే శైలాయే వంటమనిషిని హత్యచేసి తనను రక్షించుకునేందుకు యిల్లు వదలి పారిపోయింది "

ఈ స్టేట్‌మెంట్ విన్నతర్వాత బారిష్టర్ జనార్దన్ కోర్టువారి అనుమతిపొంది యీ విధంగా చెప్పాడు

"ఈ హత్యచేసినది శైలాకాదు శైలా సవతితల్లి సుశీలద్వారా జరిగింది ఆమె శైలాను చిక్కించేందుకు యీ కుట్ర చేసింది కారణము శైలా ఆమె యిష్ట ప్రకారం వివాహం చేసుకొనకపోవడమే ఆమె యింతకుముందొక ఖూనీకూడా చేసింది "

"అబద్ధం—శుద్ధఅబద్ధం నే నెవరినీ హత్యచేయలేదు" సుశీల వెర్రెత్తినట్లు బిగ్గరగా అరచింది

"నేను బారిష్టరు సుధాకర్ పుత్రుణ్ణి జనార్దన్‌ని " జనార్దన్ కోర్టువారియెదుట పరిచయమిచ్చాడు

"కాదు! కాదు! పచ్చిఅబద్ధం జనార్దన్‌కు విషమిచ్చి నేనే చంపాను కాదు! చాలారోజులక్రితమే అతడుచచ్చిపోయాడు సుశీల బిగ్గరగా జవాబిచ్చిందావేశంతో

జనార్దన్ వాస్తవికతను బయటపెట్టేందుకు చేతిక్కినసమయాన్ని పోగొట్టుకునే దద్దమకాదు అతడు తనవాదాన్ని కోర్టువారి ముందు బాగా విశదపరచాడు

"కోర్టువారి సమక్షంలో యిప్పుడిప్పుడే సుశీల విషంపెట్టి జనార్దన్‌ని చంపానని చెప్పింది ఆమె నాకు విషంపెట్టింది వాస్తవము కాని నాకు సందేహంకల్గిన కారణంచేత ఆ పదార్థాన్ని నేనొక కుక్కకు పోశాను నా బదులుగా కుక్క చచ్చిపోయింది "

తర్వాతనంతరం జడ్జీ తన తీర్పులో సుశీల వంటమనిషిని చంపినందుకు అంతకు పూర్వం జనార్దన్‌కు విషముపెట్టినందుకుగాను ఆమెమీద కేసు నడపుటకు ఆజ్ఞాపించాడు శైలా నిర్దోషియని తీర్పుచెప్పాడు

పోలీసులు సుశీలను జైలుకు తీసుకపోతుండగా జనార్దన్ శైలాలు "అమ్మా!" అంటూ సుశీల కాళ్లపై బడ్డారు యీ దృశ్యాన్ని చూచినవారంతా నివ్వెరపడిపోయారు

సుశీల జనార్దన్‌ని కౌగలించుకుంటూ "కుమారా! నన్నింక సిగ్గుపరచవద్దు ఆ చిన్నతమ్ముని జాగ్రత్తగా కాపాడుకో నాకు సెలవివ్వమని" కోరింది

పోలీసులు ఆమెను తీసుకొని ముందుకు సాగారు

---


# బహిష్టు ఆగినదా?

"దేవీ మాత్రలు "(Registered by the Central Drugs Laboratory Govt. of India under No CDL/688) ఏ కారణము వల్లనైనను ఎన్ని నెలలుగానైనను ఆగిన బహిష్టును అతిశీఘ్రముగా అతి సులభముగాను గ్యారంటీగాను, వెంటనే జారీచేయును వేనకువేలు ప్రశంసాపత్రములు పొందిన గ్యారంటీగల ఔషధము నకలి మందులనువాడి మోసపోకుడు ధర (Ordinary) రు 8-8-0, (Special) కొన్ని నెలలుగా ఆగినవాటికి రు 10-8-0

వి. పి ప్రత్యేకము

SEENU & COMPANY P B 1636, [22] MADRAS 1

ఓవర్సీస్ బ్రాంచ్ : సింగపూర్

ఏజంట్లు : కొలంబో

# జీవుల ఆత్మసంరక్షణ—జాతిసంరక్షణ

రాళ్లపల్లి ఫణిశాయి శర్మ

భూమిపైన జీవము పుట్టి కోట్లకొలది సంవత్సరములు గడచి నవి కాని జీవోత్పాదన ఎట్లు కలిగినదని ఇదివరకూ తేల లేదు కొంతమంది శాస్త్రజ్ఞులు జీవము అజీవపదార్థములనుండి ఉద్భవించినదని అనుకున్నారు ఇతరులు భూమికి జీవము ఇతర గ్రహములనుండి వచ్చియుండవచ్చునన్నారు నవీన జీవ శాస్త్రజ్ఞులు జీవము జీవమునుండి వెలువడునేగాని అజీవపదార్థములనుండి ఎప్పటికీ వెలువడదు అన్నారు వీనిలో ఏది నిజమయినా జీవము మాత్రము భూమిపైన ఇదివరకూ చావక పెరుగుతూనేవస్తున్నది అనేక జీవులు చచ్చినా "జీవము" చావలేదు వ్యక్తులు మరణించి నారుగాని జాతి చావలేదు అఖండముగా జీవసంరక్షణ జరుగుతూ వుంది

ప్రతిజీవికి ప్రతిజాతికి స్వాభావికముగానే కొన్ని శత్రువులు ఉంటాయి కప్పను పాము మింగితే పామును చంపడానికి ముంగిస సిద్ధముగానే ఉంటుంది నిర్భయముగా ఎలుకలను పట్టి మింగిన పిల్లి కుక్కను చూడగానే అదృశ్యమవుతుంది లేళ్లు మేకలు ఆవులు మొదలగు సాధుజీవులకంతకూ ఎక్కడచూచినా శత్రువులే వాని ప్రాణానికి నిర్భయత్వము ఎప్పుడూలేదు బలశాలు లైన పులి, తోడేలు సింహము మొదలగు క్రూరమృగములకు కూడ శత్రువులు లేకపోలేదు అన్ని జీవులకు పెద్దశత్రువు మానవుడు ఉండనేవున్నాడు కదా! సాధుజీవులను ఆహారముకోసమూ, క్రూరమృగములను ప్రాణభయమువల్లనూ చంపివేస్తాడు కంటికి కూడ కానరాని బాక్టీరియలనుకూడ రోగకారకులని నాశనంచేస్తాడు మలేరియాకారకులని దోమలనూ ప్లేగు ఉపద్రవం వస్తుందని ఎలుకలనూ పంటలు చెరుపని శలభ (Locusts) ములనూ నాశనం చేస్తాడు ఇంతయినా ఈ జీవజాతులన్నీ చావక ఇంకా జీవించే వున్నాయి

జీవులకు అన్నిటికంటే పెద్ద శత్రువు ఆహారాభావము ప్రతి జీవజాతి ఏవోకొన్ని ఆహారపదార్థములనే తినగలదు అవి దొరకక పోతే వానికి జీవసంరక్షణ చాలా కష్టమవుతుంది ఈ పరిస్థితిలో తమ ఆహారపద్ధతులను మార్చుకొని అవి ఏ ఆహారము సమృద్ధిగా దొరకునో దానినే తిని జీవించే శక్తిని సంపాదించుకోవలసి యుండును లేకపోతే తమకు కావలసిన ఆహారము దొరికేచోటికి నివాసమును మార్చుకోవలెను కొత్త ప్రదేశములోని కొత్త వాయు గుణమునకు పరిస్థితులకు అనుగుణముగా ప్రవర్తించవలెను వానికి అనుగుణముగా తమ గుణప్రకృతులనే మార్చుకునే సామర్థ్యము కలిగియుండవలెను ఇవి చేతకాకపోతే జీవులు జీవించ లేవు జీవశాస్త్రజ్ఞులు "డార్విన్" అన్నట్లు వానికి జీవించే అర్హత లేదు

జీవుల చరిత్రలో ఈ తత్వమునకు అనేక నిదర్శనములు కలవు "డైనోసారు" లనబడు విపులకాయులైన కొన్ని జీవులు అనేక సంవత్సరములవెనుక జీవించెడివి ఇప్పుడు ఆ జీవుల జాతే కానరాదు వానిజాతి సంపూర్ణముగా నశించిపోయినది డైనో సారులు బలశాలులైన జీవులైనప్పటికీ తమజాతిని నిలబెట్టుకోలేక పోవుటకు నిజమయినకారణం ఇదివరకూ తేలకపోయినా తమ పరిస్థితులలో కలిగిన మార్పులకు అనుగుణముగా తమ ప్రకృతిని అవి మార్చుకోలేకపోవుట ముఖ్యకారణ మయివుంటుందని జీవ శాస్త్రజ్ఞులు అనుకుంటున్నారు అట్లనే ఇప్పుడు తిమింగిల మనబడే జలచరప్రాణి మొదట భూమిపైన జీవించుచుండెననీ కొన్నేండ్ల తరువాత భూమిపైన జీవనము దుస్సాధ్యముగా అవి తమనివాస మును సముద్రములోనికి మార్చుకొని నీటిలో జీవించేదానికి అవశ్య మైన శక్తులను సంపాదించుకోగలిగినవనీ అందువల్లనే తిమింగిల ముల జాతి ఇదివరకూ సంపూర్ణముగా నశించలేదనీ శాస్త్రజ్ఞులు చెప్పుచున్నారు

మృగరాజు సింహానికి ఏనుగమాంసమే కావలెననీ చేతికి దొరికినా నక్కను తినక తిరస్కారభావముతో వదిలేస్తుందనీ, క్షామకాలములో తిండిలేక చచ్చేపరిస్థితులలోకూడ గడ్డితినదనీ కవులు చెప్పగా విన్నాము * ఇదేగనుక నిజమయితే జీవశాస్త్రతత్వ ములప్రకారం సింహానికి వేరే గొప్పగుణములేకున్నా జీవించే అర్హత చాలాతక్కువ అని చెప్పవలసియుంటుంది అందుకే

*The lion scorns the Jackal though
Between his paws, to smile
The elephant
The elephant is lion s meat,
W th drops of tickling ichor sweet
Thouh lack thereof should come to pass
The lion does not nibble grass

కాబోలు ఇప్పుడు అడవులంతా వెదకినా ఒక్క సింహము దొరికేది కష్టం



జీవుల ప్రవర్తనను బాగ పరిశీలించితే మనకు రెండు విషయములు ముఖ్యముగా కానవస్తాయి మొదటిది వాని ఆత్మసంరక్షణ (ప్రతివ్యక్తి తన ప్రాణమును కాపాడుకునేదానికి సర్వదా ప్రయత్నించుట) రెండవది జాతి సంరక్షణ (వ్యక్తులు చచ్చినా జీవజాతులు సామాన్యముగా చావవు) ప్రాణము వంశము వీనిని కాపాడుటవలన జీవులకు కలిగే లాభమేమి అని విచారించి చూచితే ఆఖరికి ఏమీలేదనే తేలుతుంది కాబట్టి ఆత్మసంరక్షణ జాతిసంరక్షణ ఈ రెండు జీవులకు స్వాభావికమయిన గుణములు అని శాస్త్రజ్ఞులు నిర్ధరించినారు జీవులు లాభనష్టములనుగాని మంచిచెడ్డలనుగాని విచారించక చేయు అనేక పనులలో ఈ రెంటిని చేర్చినారు

నిజానికి జీవులు స్వాభావికముగా చేయు పనులన్నిటి పరమోద్దేశము ఆత్మసంరక్షణ లేక జాతిసంరక్షణ అని చెప్పవలసియుంటుంది [1] ఆహారసంపాదన సాంఘికజీవనము స్త్రీపురుషుల పరస్పర కామోద్రేకము ప్రాణాపాయము కలుగు సమయములలో భయోత్పత్తి ఇవన్నీ పైన చెప్పిన తత్వమునకు ఉదాహరణములు

ప్రాణుల జీవితములో అప్పుడప్పుడు ఆత్మసంరక్షణకూ జాతిసంరక్షణకూ కలహము కలుగుతూవుంటుంది ఒక చెట్టుక్రింద కోతుల సమూహము ఒక్కటున్నదనుకుందాం బడిపిల్లవాయలు కొందరు తుంటరితనమువలన వానిపైన రాళ్లు విసరేదానికి ప్రారంభిస్తే వానిలో బలశాలులైన కోతులు చిన్నవాటిని కాపాడుటకు ప్రయత్నిస్తే తమప్రాణమే పోవచ్చుననే భయమువలన వానిని వదిలేసి తమప్రాణమునుమాత్రం రక్షించుకోవలెనా ? లేక తమ ప్రాణములను లెక్కించకుండా సమూహమును కాపాడుటకు ప్రయత్నించవలెనా ? మరొక సన్నివేశము చూడండి ఒక సైన్యములో అందరూ తప్పించుకొని ఒకడుమాత్రం శత్రువులకు దొరికిపోయినాడనుకుందాం అప్పుడు ఆ ఒక్క ప్రాణమును కాపాడుటకై ప్రయత్నించి పైనికసమూహమే తమప్రాణములను కోల్పోవుటకు తయారుగావుండవలెనా ? లేక సమూహముయొక్క మంచికై ఆ వ్యక్తిని త్యాగముచేయవలెనా ? వ్యక్తి సమూహం వీనిలో ఏది ముఖ్యం ? దేనికి మనము ఎక్కువ ప్రాశస్త్య మివ్వవలెను ?

మానవులలో వ్యక్తి ముఖ్యమనేవారు సంఘమునకు ప్రాశస్త్య మివ్వవలెననేవారు ఇద్దరు కానవస్తారు ప్రతివ్యక్తి తనప్రాణమును కాపాడుకుంటేగాని జాతిసంరక్షణ అసాధ్యమవుతుంది కాబట్టి వ్యక్తికే ప్రాశస్త్య మివ్వవలెనని కొందరు వాదించారు వ్యక్తి తనప్రాణమును రక్షించుకునేది నిజానికి జాతిని రక్షించేదానికేననీ, కాబట్టి జాతికే ఎక్కువ ప్రాశస్త్య మివ్వవలెననీ మరికొందరు వాదించినారు వ్యక్తిలేక సంఘముండదు సంఘమును విడిచి వ్యక్తి జీవించలేడు కాబట్టి ఈ ప్రశ్న తెగేదికాదు చెట్టుముందా ? విత్తనము ముందా ? అను ప్రశ్నవలె దీనికి అర్థము లేదు అనుకునేవారు మరికొందరు

వాదప్రతివాదములు ఎట్లున్నా వ్యక్తా ? సమూహమా ? అను ప్రశ్నకు జీవులంతా "సమూహమే"నని ప్రత్యుత్తరము ఇచ్చినట్లు కానవస్తుంది "అమీబా"లలో తల్లిదేహము రెండుగా చీలి, అవి వేరువేరుగా పెరుగుటవలననే వంశోద్ధారము సాధ్యమవుతుంది కొన్ని కీటకములలో వంశోద్ధారానికై మగపురుగు బలి అవుతుంది ఆడదానితో కామసంయోగము కాగానే అది చచ్చిపోతుంది దాని జీవితోద్దేశము అక్కడికి సంపూర్ణమవుతుంది సంఘముకొరకు వ్యక్తిని నిర్లక్ష్యముగా బలిఇచ్చుట పెంగ్విన్ పక్షులలో చాలాబాగ కానవస్తుంది సముద్రములో చేపలను పట్టునప్పుడు ఈ పక్షులు "షార్కు" మొదలగు పెద్దచేపలకు భయపడి అవి అక్కడ ఉన్నవో లేవో ముందుగానే తెలుసుకునేదానికి మొదలు తమలో ఒక పక్షిని బలవంతముగా నీటిలోనికి త్రోసివేస్తాయి ఆ పక్షి షార్కులవాతపడలేదని ఖండితముగా తెలిసేవరకూ మిగతా పక్షులు ముందుకు అడుగుపెట్టవు షార్కులు ఉన్నట్టయితే ఆ పక్షి దానికి బలియయినట్లే

సంఘానికై వ్యక్తులను త్యాగముచేయుట మానవులకుకూడ సహజమేనని మానవ ఇతిహాసమునుండి మనము తెలుసుకోవచ్చును మహాభారతములోని బకాసురుని కథ చూడండి ప్రతిదినం ఇంటికొక మనిషిని తనకు ఆహారముగా పంపకపోతే సర్వనాశనం చేస్తానని బకాసురుడు బెదరిస్తే ఏకచక్రపురవాసులంతా ఇంటి కొక మనిషినే పంపిస్తామని ఒప్పుకున్నారట అరేబియా దేశపురాజు ఒకడు తనభార్య విశ్వాసద్రోహము చేయగా చూచి ఆడవాళ్లంతా కులటలని తీర్మానించి అందరినీ నాశనంచేస్తానని బెదరిస్తే పురజనులు అతనికి దినమొక కొత్తకన్యను సంపాదించి ఇచ్చేదానికీ అతడు అనుభవించినతరువాత ఆమెను చంపివేయడానికీ ఒప్పుకున్నారట వంశనాశనము కాకూడదని బాబరు మహాశయుడు రోగగ్రస్తుడయిన హుమాయూను ప్రాణములను తన ప్రాణములనిచ్చి కాపాడినవిషయము లోకవిదితము

నిదర్శనాలను ఎంతైనా పెంచుకోవచ్చును కాని ముఖ్యమయిన విషయము ఇంతే వ్యక్తుల త్యాగమువలన సంఘము బాగుపడే సూచనలుంటే అటువంటి త్యాగమునకు సంఘము ఎప్పుడూ సిద్ధముగాఉంటుంది సిద్ధముగా ఉండవలెనుకూడ లేకపోతే జీవసంరక్షణ సాధ్యమే అయివుండదు ఈ తత్వమును బాగా తెలుసుకొన్న మన పెద్దలు ఒక ఇంటికై ఒక మనిషినీ ఒక గ్రామానికై ఒక ఇంటినీ ఒక దేశానికై ఒక గ్రామాన్నీ వదలుకోవచ్చునన్నారు మరికొంద రన్నారు "సర్వనాశే సముత్పన్నే అర్థం త్యజతి పండితః" అని ఈ తత్వముయొక్క విలువను అన్నిజీవులు తెలుసుకున్నాయో లేవో మనము చెప్పలేముగాని దానిని అనుసరిస్తూ వచ్చినాయనిమాత్రం ఒప్పుకోవలసియుంటుంది

---

1 కొన్ని కర్షక్రియలు (Tropisms) వినా

# ఏరిన ముత్యాలు

## వ్యావహారిక భాషోద్యమం

మల్లంపల్లి సోమశేఖరశర్మ

సాహిత్యరంగంలో వ్యావహారికభాష ప్రవేశించింది శ్రీ గిడుగు వేంకటరామమూర్తి పంతులుగారి వ్యావహారికభాషోద్యమం తరువాతనే శ్రీ రామమూర్తి పంతులుగారు వ్యావహారికభాషావాదం లేవదీయకుంటవరకు పత్రికలలోకాని పుస్తకాలలోకాని వ్యావహారికభాష కనిపించనేలేదు ఇప్పుడు వ్యావహారికభాషలో వ్యాసం కనబడని పత్రికా లేదు విజ్ఞానము చరిత్ర కథ మొదలైన సారస్వతశాఖలు పెక్కింటికి సంబంధించిన పుస్తకాలలో అనేకములు వ్యావహారికభాషలో వ్రాయబడినవి ప్రకటితవు కథలు నవలలు ఏకాంక నాటికలు ప్రజాసామాన్యానికి సుబోధమగుటకై వ్రాస్తున్న విజ్ఞాన గ్రంథాలు—అన్నీ యిప్పుడు వ్యావహారికభాషలోనే వస్తున్నాయి ప్రాథమిక పాఠశాలలలోను ఉన్నత తరగతి పాఠశాలలలో చెప్పుతున్న పాఠ్యగ్రంథాలు విశ్వవిద్యాలయాల్లో చెప్పుతున్న పాఠ్యగ్రంథాలు తప్పితే చాలావరకు ఇప్పుడు ప్రకటితమవుతున్న వాఙ్మయంలో—పోనీ సగానికెక్కువ కాకపోయినా—సగానికి సగమైనా వ్యావహారికభాషలోనే ఉంటున్నది పాఠశాలలలో పెద్ద పుస్తకాలు మినహాయిస్తే ఆధునిక వచనసాహిత్యమూ, విజ్ఞానవాఙ్మయమూ చాలావరకు వ్యావహారికభాషలోనే వస్తున్నది వ్యావహారికభాషలో సాహిత్యం బాగా పెరుగుతూ వస్తున్నది భాషోద్యమం బాగా బలపడినకొద్దీ వాతనే రచయితల సంఖ్యకూడా ఎక్కువైనది ఈ ఉద్యమం వచ్చినతరువాత అంతవరకు పూడిపోయిన జాతి గొంతుక క్రమక్రమముగా విడబడుతున్నది ఏ విషయములోనైనా ఏ సమస్యలకు సంబంధించినవైనా మనస్సులో గుబగుబలాడే భావాలను పైకి వ్యావహారికభాషలో వ్యాసంగానే వెల్లడించడానికి ఎవరూ ఇప్పుడు జంకటంలేదు మన జాతికి వ్యావహారికభాషోద్యమం చేసిన గొప్ప మేలిది ప్రజాప్రభుత్వ యుగాని కనుగుణమైన పరిణామమే యిది

గ్రాంథికభాషలో వ్రాస్తే అర్థంకాదు; వ్యావహారికభాషలో వ్రాస్తే అర్థమవుతుందన్న వాదన నిస్సారమైనది దానిలో బలంలేదు రచన గ్రాంథికభాషలో చేసినా అర్థమవుతుంది వ్యావహారికభాషలో చేసినా అర్థమవుతుంది—అర్థం కాని పెద్ద సంస్కృత సమాసాలుండేతప్ప సంస్కృతభాషాపండిత ప్రభావంచేతను ప్రాబల్యం చేతను తెలుగు రచయితలు తమకు తెలియకుండానే సంస్కృతకావ్య రచనావిధానాన్ని అవలంబించి సంస్కృతాన్ని పగవరిగా చేసుకొన్నారు అందువల్ల వ్రాసేవి తెలుగుగ్రంథాలైనా వికాసించి సంస్కృతకావ్యముల పక్కనే సంస్కృతత్వంతో నడచినవి. ఇట్టి సమాసా లుండకూడదనికాని అలంకారము లుండకూడదనికాని నా అభిప్రాయముకాదు అవన్నీ ఉండవచ్చును కాని యీ వ్యావహారిక భాషోద్యమం బయలుదేరేవాటికి తెలుగు రచనలో తెలుగు నుడికారం తెలుగు జాతీయత తెలుగుతనం లోపించిపోయినది కావిరిలా కమ్మిన యీ సంస్కృతంల ప్రభావపు జడిమను పోగొట్టి మరల తెలుగు రచనకు తెలుగుదనమును ఒడగూర్చి ఒకే తెలుగు నుడికారపు సౌభాగ్యమును పెంపొందింపజేయుటకే వ్యావహారిక భాషోద్యమం వచ్చిందనీ వ్యావహారిక భాషోద్యమం ప్రయోజనవమనీ నా నమ్మకం

వ్యావహారికం వేరూ నింద్య గ్రామ్యం వేరూ అనే విషయం మనం జ్ఞాపకముంచుకోవాలి గ్రామ్యమూ నింద్యగ్రామ్యమూ అనేవి ఇంగ్లీషులో స్లాంగ్ (Slang) వంటిదానికి వాడబడినవి సంస్కారులు శిష్టభద్రులు కులీనులు మాటాడే భాషకు గ్రామ్యం అను పేరుపెట్టడం దానిని గ్రామ్య మనే పేరుతో వ్యవహరించడం అనుచితమూ అయుక్తియుక్తమూను కీర్తిశేషులైన బ్రహ్మశ్రీ చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారు వారి జీవితం చరమదశలలో సాహిత్యవిషయాలను గురించి పత్రికల కెన్నో వ్యాసాలు వ్యావహారికభాషలో వ్రాశారు వారిది చక్కని శైలి వ్యావహారికములో రచన చేసేవారు వరవడిగా తీసుకోదగినది అటువంటి వ్యాసాలను గ్రామ్యంలో ఉన్నాయని నిరాకరించడం నిందించడం అవివేకమైన పని

ఈ ప్రజాప్రభుత్వయుగంలో విజ్ఞానాభివృద్ధి నిమిత్తం ప్రజలు తెలుసుకోవలసిన ప్రజలకు తెలియజేయదగిన గ్రంథాలన్నీ వ్యావహారిక భాషలో వ్రాయాలి చాలావరకు అవన్నీ వ్యావహారికభాషలో వస్తూనే ఉన్నాయి అయితే వ్యావహారికభాషలో ఉన్న చిక్కల్లా క్రియారూపాల దగ్గరే వీటిని ఎవరియిష్టంవచ్చినట్టు వారు వ్రాస్తున్నారు కొందరు ఇటువంటి రూపాలలోని కొన్ని కొన్ని అక్షరాలనే హరించివేస్తున్నారు. కొందరు కొన్నికొన్ని రూపాలనే శబ్దస్వరూపంకూడా తెలియకుండా వికృతం చేస్తున్నారు వ్యావహారిక రచనలలో ఇంకా ఎన్నెన్నో చిత్రవిచిత్రాలు కనబడుతున్నాయి ఇదంతా వ్యావహారికమే అనడానికి నా మనస్సొప్పదు వ్యావహారికానికికూడా ఒక రీతి ఉంది; ఒక పద్ధతి ఉంది ఉచ్చారణలో ఏమాట ఎట్లా మారినా అది దాని ఇష్టంవచ్చినట్టు మారదు కొన్ని స్వరశాస్త్ర సూత్రములకు (Phonetic laws) కట్టుబడే మారుతుంది. ఇప్పించుచున్నా డన్నది ఇప్పించుచున్నాడు, ఇప్పిస్తున్నాడుగా మారి చివరికి ఇప్పిస్తున్నా డన్న రూప మేర్పడింది ఈవిధంగానే మనం వాడే ప్రతిరూపానికి చూపించవచ్చును వ్యావహారికంలోకూడా శాస్త్రోచితభాష వాడవచ్చును

వ్యావహారికంలో విశృంఖలత్వం, క్రియారూపాదులు నానావిధాలుగా వాడవచ్చును అంతేకాని వ్యావహారికానికి సాహిత్యగౌరవం సాధించాలంటే దానిని ఒక పరిశుద్ధమైన పద్ధతిని కొంత కట్టుబాట్లతో ఉపయోగించాలికాని యథేచ్ఛంగా ఎవరియిష్టంవచ్చినట్టు వారు కల్పించుకొన్న రూపాలను శబ్దవికారాలను వాడడం యుక్తంకాదు అటువంటివి వాడుతూ వున్నంతకాలం వ్యావహారానికి గౌరవమూ రాదు పండితులకు దానిమీద అభిమానమూ కుదరదు అయితే సంభాషణలలో (dialogues) అటువంటి రూపాలు కొంత సహించవచ్చునేమోకాని గద్య సాహిత్యంలో కట్టుబాటుగా వ్రాయడమే ఉచితము స్వేచ్ఛ అని చెప్పి ఇష్టంవచ్చినట్లు ఎట్లా ప్రవర్తించడానికి వీలులేదో అవిధంగానే వ్యావహారికాన్నికూడా ఇష్టంవచ్చినట్టు వ్రాయడం మంచిది కాదు

వ్యాకరణపు కట్టుదిట్టాలతో వుండని గ్రాంథికాన్ని పనికిరాదని వ్యావహారికాన్ని తెచ్చిపెట్టి మళ్ళీ దీన్ని ఒక కట్టుబాటుగా వ్రాయాలంటారేమిటని కొందరనవచ్చును గ్రాంథికంలోకూడా శ్రీ కందుకూరి వీరేశలింగము పంతులుగారు కట్టుబాట్లు చాలా సడలించారు సంధిచేసి తీరాలనే నియమం లేదు ఇప్పుడు శకటరేఫలూ అరసున్నలూ పెట్టితీరాలన్న నిర్బంధంలేదు ఇటువంటి నియమాలూ నిర్బంధాలూ లేనప్పుడు గ్రాంథికం వ్రాయడమూ సులువే అందువల్ల కట్టుబాట్లతో వుండినందుకు కాదు గ్రాంథికం మూలపడేస్తున్నది; జీవద్భాష అయిన వ్యావహారికంలో అభిప్రాయ వ్యాయాభేదాలు చూపటం వీలున్నట్టు దానిలో లేదుగనుక తెలుగు జాతీయము తెలుగు నుడికారము పోతున్నది కనుక వ్యావహారికం వచ్చింది గ్రాంథికాన్ని విడిచిపెట్టి వ్యావహారికాన్ని చేపట్టినాం కనుక దీనిని వ్రాయటంలో ఒక పద్ధతీ ఒక రీతీ ఉండనక్కరలేదనడం న్యాయంకాదు

—కృష్ణాపత్రిక (10-1-58)

## ఆంధ్ర వ్యాకరణము

ఈమధ్య కిన్నెర" పత్రికలో "వాడుక భాష—విశ్వవిద్యాలయములు" అను వ్యాసము వచ్చినది అది వాడుకభాషయొక్క ప్రాశస్త్యమును తెలిపి యట్టి ప్రశస్తమైన భాషను విశ్వవిద్యాలయములు వెంటనే యాదరింపవలెనని నివేదించెను మొదట నది చిన్నయసూరిపై ద్వేషమెత్తెను అనంతరమున వ్యావహారిక భాషా పోషకులనగా కందుకూరి వీరేశలింగముపంతులు గారిని గిడుగు రామమూర్తిపంతులుగారిని, గురజాడ అప్పారావుగారిని ప్రశంసించెను

చిన్నయసూరి లోపముల నిట్లు వివరించిరి— చిన్నయసూరికి పూర్వము వాడుకభాషలో గ్రంథరచనము జరుగుచుండెడిది ఈయన బాలవ్యాకరణమును రచించి తెలుగు భాషాభి మార్గమును బాదుచేసెను చిన్నయసూరి చెన్నపట్టణపు ప్రాంతములలో పుట్టి పెరిగినవాడు అందుచే "తెలుగుదేశానికి సన్నిహితంగా ఉండటానికి అంత సంపర్కం లేకపోయింది కావున జీవద్భాష అయిన నాటితెలుగుతోను తెలుగుదేశపు శిష్ట సంప్రదాయంతోను సూరిగారికి పరిచయం లభింపలేదు" అని వ్రాసినారు పూర్వగ్రంథముల నుండి యనేక లక్ష్యముల నొసంగుచు నొకచేతి మీదుగా తెలుగు నిఘంటువునంతయును వ్రాయ నేర్చిన పండితాగ్రేసరుని పదుమంది పండితులతో నిత్యసంబంధము లభింపగల తెలుగు రాజధానియగు చెన్నపురియందు నివసించిన వారికి నాటితెలుగు తెలియదని చెప్పుట యతి సాహసము వారింకను వ్రాసిరి—సూరి ప్రెసిడెన్సీ కాలేజీలో తెలుగు పండితులుగానుండి యధికారబలముచే తన వ్యాకరణమును విశ్వవిద్యాలయములలో ప్రవేశపెట్టి వాడుకభాష కట్టి యవకాశము గల్గకుండ జేసినారు అని వారనిరి. నిజమరసినచో మనకు లభించెడి తెలుగు వ్యాకరణములలో బాలవ్యాకరణమువలె సులభమైనది సమగ్రమైనది మఱియొకటి లేదు అందువలన తెలుగు దేశమంతయు దానిని శిరసావహించెను తెలుగు దేశము దేనిని శిరసావహించెనో దానినే విశ్వవిద్యాలయము లాదరించినవి బాలవ్యాకరణము నందలి గుణములను గ్రహించియే విశ్వవిద్యాలయము లాదరించినవిగాని చిన్నయసూరి యధికారమును జూచికాదు

వాడుకభాషలో గ్రంథముల వ్రాసి తత్ప్రచారమునకై నడుముకట్టిన గిడుగు రామమూర్తి పంతులుగారిని, గురజాడ అప్పారావుగారిని ప్రశంసించిన నర్థమున్నదిగాని లాక్షణికభాష నంగీకరించిన కందుకూరి వీరేశలింగముగారిని పొగడుటచే వీరి కేమి లాభమో తెలియుటలేదు పంతులుగారు తమ రచనలన్నిటిని పండిత పామరుల కర్థమగు మనోహరమైన లాక్షణిక భాషలోనే వ్రాసిరి వారి ప్రహసనములలోని వాడుకభాష పాత్రోచితముగా ప్రయోగింపబడి నదేగాని యా భాషయందలి యాదరముచేగాదు పైవిధముగా సూరిమీద, వారి బాలవ్యాకరణము మీద దాడిచేసిన వ్యాసాంతమున "నేటి భాషకు ఒక దిగ్దర్శనప్రాయంగా రూపింపగల వ్యాకరణం ఒకటి అవసరం అట్టి వ్యాకరణమే విశ్వవిద్యాలయాలలో పఠనీయగ్రంథం కావాలి" అని వ్రాసిరి. జీవద్భాష కెవరును సమగ్రమైన వ్యాకరణము వ్రాయలేరు. నేటి భాషకు బాలవ్యాకరణము సమగ్రమైన వ్యాకరణముకాదు కావున నిదియు దిగ్దర్శనప్రాయమైన వ్యాకరణమే యని చెప్పవచ్చును ఇట్టి బాలవ్యాకరణము దూషించి వీరెట్టి వ్యాకరణమును రచింతురో తెలియకున్నది. వేరు వ్యాకరణము రచింపవలెనన్న నొకరు వ్రాయగడంగుట సమంజసముగాదు ఒక్కరే తమకు దోచినవిధమున వ్రాయదలంచినచో దానిని వారి కూటమువారెవరైన నాదరింతు రేమోకాని యాంధ్రదేశమంతయు శిరసావహించు టసంభవము ఈనడుమ శ్రీ గిడుగు సీతాపతిగారు వాడుకభాషకు వ్యాకరణము వ్రాయుచున్నటుల పత్రికాముఖమున వినియుంటిమి కిన్నెర పత్రికలో సూచింపబడిన దిగ్దర్శన ప్రాయమైన వ్యాకరణము శ్రీ సీతాపతిగారు రచించుచున్న వ్యాకరణమునుగూర్చియే కావచ్చును వారొక్కరే యట్టి పనికి బూనుటకంటె ప్రాచీన సంప్రదాయానుసారులైన సుప్రసిద్ధులగు పండితులను భాషాశాస్త్ర సంప్రదాయవిదులను గలిసికొని సర్వజనసమ్మతమై సర్వాంధ్రదేశము నకు వ్యవహారయోగ్యమైన వ్యాకరణము వ్రాయుట ప్రశస్తముగా నుండును ఇట్టి వ్యాకరణ మొకటి సర్వజనాదరణమును బడసినచో నేటి పత్రికల లోను పుస్తకములలోను వ్రాయబడుచున్న హేయమైన భాష కవకాశము లేకుండబోవును ఆంగ్లములో భాషావేత్తలగువారే పత్రికాసంపాదకులుగా గ్రంథరచయితలుగా నుందురు మనవా రాంధ్రభాష చదువవలసిన క్రమమున జాల్పరకమే దానియందు గ్రంథరచన నారంభించుచున్నారు గొంగళిలో దినువానికి వెంట్రుకలకై వెదక నవసరములేనట్లు వీరి రచనలలో దప్పుల వెదక నవసరములేదు ఎవరికి దోచినట్లు వారు వ్రాయుచున్నారు శిష్టమైన భాష యను బాధలేక యెట్టి దైనను చలామణి యగుచున్నది సర్వజన సమ్మతమైన యొక భాషానుశాసనము లేనికే యిది శిష్టము ఇది యశిష్టమని యెవరు చెప్పగలరు? ఎవరికివారు తాము వ్రాసినభాషనే శిష్ట

మూగా దలంచుచున్నారు. భాష నియమరహితమైనచో విర్థ యనర్థములే సంభవించుచుండును. నియమరహితమైన భాష యెవ్వరికిని సర్వజనాంగీకారమును బడయజాలదు. అందువలననే నియమసహితమైన భాష యవసరమని మా పరిషత్తు చిరకాలమునుండియు ఉద్ఘోషించుచున్నది. తెలుఁగుభాషకు సజాతీయేతరభాషలతోఁ గల సాదృశ్యములను సాకల్యముగా విచారించుచు నొక వ్యాకరణమును రచించి ప్రచురించుట ప్రధానమైన మా పరిషదుద్దేశములలో నొకటి. ఈనాఁటికైనను వ్యావహారికవాదులు వ్యాకరణావశ్యకతను గ్రహించుట యాంధ్రభాషకు శుభావహము.

—ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక
(చైత్ర-భాద్రపదములు)

## ముగ్గురు అమెరికన్ రచయితలకు బహుమానాలు

అమెరికా గ్రంథప్రకాశకుల సంస్థచే ఏర్పాటు చేయబడిన జాతీయగ్రంథ బహుమానాలు ఈయేడు ముగ్గురు అమెరికన్ రచయితలు పొందారు. వారు నవలారచనలోను, చారిత్రక రచనలోను, పద్యరచనలోను వెలువరించిన ఉత్తమ గ్రంథాలకు ఈ బహుమానాలు ఇవ్వబడ్డాయి. ఈ బహుమానాలు ఏర్పాటుచేసి నాలుగు సంవత్సరాలైంది

"ఇన్విజిబుల్ మాన్" అనే నవలను రచించిన రాల్ఫ్ ఎలిసన్‌కు, "కోర్స్ ఆఫ్ ఎంపైర్" అనే గ్రంథాన్ని రచించిన బెర్నార్డ్ డెవోటోకు, "కలెక్టెడ్ పోయెమ్స్, 1917-52" ప్రచురించిన ఆర్చిబాల్డ్ మేక్లీష్‌కు ఈ బహుమానాలు ఇచ్చారు

ఈ బహుమాన ప్రదానోత్సవానికి మొత్తం 600 మంది రచయితలు విమర్శకులు, ప్రచురణకర్తలు హాజరయ్యారు.

ఎలిసన్‌ను గురించి నిర్ణయాధికారులు ఈ విధంగా చెప్పారు: "అద్భుతమైన వర్ణనాచాతుర్యంతో నవలారచనలో ఉండే సంప్రదాయాలను, కట్టుబాటులను ఈయన అధిగమించి వ్రాశారు. ఆ సందర్భంలోనే సారస్వతరంగంలో ఈయన కొంత సాహసాన్ని ప్రదర్శించి సఫలులయ్యారు "ఇన్విజిబుల్ మాన్" నేటి అమెరికాలో ఒక నీగ్రో బాలుని గురించిన గాథ

"ది కోర్స్ ఆఫ్ ఎంపైర్" అనే గ్రంథం ఉత్తమమైనదని నిర్ణయాధికారులందరు ఏకగ్రీవంగా ఆమోదించారు. అమెరికాను అన్వేషించడంలో స్పెయినువారి సాహసకృత్యాలు మొదలుకొని, లూయిస్ క్లార్క్‌ల సాహసకృత్యాల వరకు ఇందులో వ్రాయబడిఉన్నాయి అమెరికా చరిత్రను గురించి వ్రాయబడిన ఉద్గ్రంథాలలో ఇది మూడవది

కాలానుగుణ్యంగా ఇతివృత్తాన్ని నిర్ణయించడంలోనేమి 35 సంవత్సరాల కాలంలోను పద్యరంగంలో ఆయన సాధించిన విజయాలకైతే నేమి ఈ బహుమానం మేక్లీష్‌కు చెందాలని నిర్ణయాధికారులు చెప్పారు

—అమెరికా వార్తావాహిని (2-2-58)

## వయోజన విద్య - సంగీతం

ఆచార్య పి సాంబమూర్తి

వయోజన విద్యకు సంగీతం అనేకవిధాల ఉపయోగిస్తుంది. వయోజనులలో సాంస్కృతిక సృజనాత్మకాదులయిన నా లు గు శక్తులను పెంపొందించటానికి సంగీతం చక్కగా ఉపయోగపడుతుంది. సంప్రదాయ సిద్ధమైన సంస్కృతిని, వయోజనులు ఆకళింపు చేసుకొని తమ ఆలోచనాశక్తిని పెంపొందించుకొనటానికి సంగీత శాస్త్రం వినియోగపడుతుంది. అక్షరజ్ఞానం పెంపొందించుకొనటానికేగాక వయోజనులు తిరిగి నిరక్షరాస్యతలో పడకుండా ఉండటానికికూడా సంగీతాన్ని వాడుకోవచ్చు తదనుగుణంగా వయోజనులకు గ్రంథపఠనాన్ని సంగీతంద్వారా పెంపొందించవచ్చు

గతాన్ని విశాలదృష్టితో పరిశీలించగలిగితే మన పూర్వీకులలోని వయోజనులు ఈనాటి వయోజనులకంటె విద్యావంతులని తెలుస్తుంది అందుకు అనేక కారణాలున్నవి కథా కాలక్షేపాలలోను, పురాణ పఠనంలోను వారు విశేషంగా పాల్గొంటూండడం మొదటి కారణం సకల విద్యాపారంగతులైన భాగవతులు ఆ రోజులలో అనేకమంది ఉండేవాళ్లు వారు గ్రామాలలో నిరంతరం పర్యటించి సంగీత కాలక్షేపాలు చేస్తూండేవారు.

కాలక్షేపం అంటే కేవలం కథ చెప్పటంతో ఆనాడు వారు సంతృప్తి చెందేవారుకాదు. ఉద్గ్రంథాలలోని శ్లోకాదులను కాలక్షేపాలలో వారు కొట్టిపోసేవారు అంతేగాక ఆ శ్లోకాలలోని గూఢార్థాలను ద్రాక్షాపాకంలో వయోజనులకు అరవిడిచి చెప్పేవాళ్లు

ఇక ఆనాటి భాగవతుని వాగ్ధాటి అతని వర్ణనాతీతం దానికితోడు సమయస్ఫూర్తి సమవరించి పెద్ద కథలోని సందర్భాన్నిబట్టి అనేక ఉపాఖ్యానాలు చెప్పి ఆనాటి దైనందిన జీవితం మీద వారు వ్యాఖ్యానిస్తూంటే వయోజనులకు వీనులవిందై వారు వివేకాన్ని పెంపొందించటంలో ఆశ్చర్యపడవలసిన విషయం ఏమిలేదు పైగా నిగూఢవిషయాలను తెలిసి తెలియనట్లుగాక మిడిమిడి జ్ఞానంతోగాక సందర్భోచితమైన వ్యంగ్యహాస్యాది రసాలతో నాటి భాగవతులు వయోజనులను ఉర్రూతలూగించేవారు

కాలక్షేపములతోపాటు సశాస్త్రీయమైన సంగీతంకూడా ఆనాటి హరికథలతో సర్వసాధారణంగా వినవచ్చేది. అందువలన శ్రోతలో రసపిపాస పెంపొంది అలంకారజ్ఞానం అలవడేది కథకుడు కాలక్షేపంలో సందర్భాన్నిబట్టి భజన ప్రారంభిస్తే ఆనాటి శ్రోత అప్రయత్నంగా అందులో పాల్గొనేవాడు తగినంత ప్రోత్సాహంలేని కారణాన ఈ రోజులలో హరికథా కాలక్షేపం నశించిపోవుట మన దురదృష్టం

దక్షిణ భారతంలో హరికథలను చెప్పే ఉత్తమ భాగవతులు నే డనేకు లున్నారు. మద్రాసులోని కర్ణాటక సంగీత కేంద్రకళాశాల ఈ హరికథల సమస్యను సావధానంగా పరిశీలించి వాటి అభివృద్ధికి తగిన బోధన ప్రణాళికలను ఏర్పాటుచేయనిచో ఈ కళ కాలగర్భంలో కలిసిపోక తప్పదనిపిస్తుంది. పౌరాణికు లానాడు భక్తితో పురాణ గ్రంథాలలోని విషయాలను శ్రోతలకు వివరించేవాళ్లు ఈనాడు వారి సంఖ్యకూడా క్రమంగా తగ్గిపోతోంది

### భజన మందిరాలు

గ్రామగ్రామాలలో ఆనాడు భజనమందిరాలుండేవి. పర్వదినాల్లో భాగవతులు తమ శిష్యులతోపాటు ఆ మందిరాలలో భజనలు చేసేవారు. నామావళిని భజించేటప్పుడు శ్రోతలు కూడా అందులో పాల్గొనేవాళ్లు సుశిక్షితులైన శిష్యులు భాగవతుల ఆధ్వర్యాన భజనల నాలాపిస్తుంటే భక్తిరసం ఉట్టిపడేది. పైగా ఆయా కీర్తనల తాత్పర్యాన్ని వాటిని వ్రాసిన రచయితల జీవిత విశేషాలను, భాగవతులు కళ్ళకు కట్టినట్లు చెప్పేవాళ్లు. అటువంటి భజనమందిరాలు లేని గ్రామాలలో దేవాలయాలలో ఆ భజనలు జరిగేవి. ప్రసాదాదులకయ్యే ఖర్చులను ఆయా గ్రామస్థులు వంతులప్రకారం భరించేవాళ్లు

## దేవాలయాలలో ఉత్సవాలు

ఇక ఆకాలంలో దేవాలయాల్లో జరిగే ఉత్సవాలు ప్రజలలో కళాభిరుచిని ఎంతగానో పెంపొందించేవి. ఆ ఉత్సవాలలో ప్రజలు సత్యసంగీతం మతప్రబోధాలు వందుకోగలిగేవారు విగ్రహాలకు వాహనాలకు అనాటి అలంకరణ ప్రజల కళాభిరుచిని పెంపొందించేవి దేవదాసులు మొదలైనవారు ఆ ఉత్సవాలలో భరతనాట్యం నృత్య నాటకాదులు ప్రదర్శించి ప్రజల కళాభిరుచి పెంపొందటానికి మహోత్తరావకాశం కల్పించేవారు

ఉత్సవాలలో వేదగోష్ఠి జరిగేది నృత్య నాటకం ప్రజలకు వాస్తవ కళాభిరుచిని కలిగించి నవరసజ్ఞానం పెంపొందించేది. సంగీత సంభాషణలు ఆ ఉత్సవాలకు విమూత్నాలంకారాలు ఇప్పుడు పరిస్థితులు మారినవి నృత్యనాటకాలను ప్రదర్శించేవారు లేరు దేవాలయాలలో అటువంటి ప్రదర్శనాలు అసలే జరగటంలేదు

తిరువారూరు దేవాలయంలో ఇదివరకు జరిగే వల్లికేసేవ ప్రబంధంగాని తిరుకలికుంద్రమ్ దేవాలయంలో ఏటేటా జరిగే సురగురు నాటకంగాని కుంభకోణం కుంభేశ్వర కురవంజిగాని, తెంకాసి దేవాలయంలో ఏటేటా జరిగే తిరుక్కుత్రాల కురవంజి ఉత్సవాలుగాని ఈనాడు కన్పించవు.

ఒక చెంప పురావస్తుస్మృతిని పునరుద్ధరించాలని మహోపన్యాసాలిస్తూనే ఉన్నాం మరొక చెంప మన కళ్ళఎదుటనే నశించిపోతూన్న సంప్రదాయాల సంగతి పట్టించుకోవలేక పోతున్నాం కొన్ని దేవాలయాల్లో వేదపారాయణం కూడా ఇప్పుడు జరగకుండాపోవటం శోచనీయం

వేలాది సంవత్సరాలనుంచి మన వైదికులు వేదాల రూపాన సంగీతాన్ని కాపాడుకొంటూ వచ్చారు ఆ సంప్రదాయాన్ని ఈనాడు మనం విస్మరించరాదు దాన్ని కాలగర్భంలో కలిపిపోపి రాదు సామగానంలోని సంగీతాంతరాలు ప్రపంచంలోని ప్రసిద్ధ సంగీతాలన్నింటిలో ఉన్నవని మనం గుర్తించడం అత్యంతావశ్యకం

## గ్రామాలలో వయోజన సంగీత తరగతులు

గ్రామాల్లోని పాతకాలంలో సంగీత బోధనాచార్యుని చేతనే వయోజనులకు కూడా సంగీతం చెప్పించవచ్చు సులభసాధన యోగ్యమైన రాగాలను పాటలను కీర్తనలను అచ్చువేయించి వయోజనులం కివ్వవచ్చు వాటిలోని మొదటి భాగాలను ఆ ఉపాధ్యాయుడు వయోజనులకు నేర్పి వారిచే కంఠస్థం చేయించాలి ఆ తరువాత మిగిలిన భాగాలను వారే నేర్చుకునే ఏర్పాటు చెయ్యాలి ఈరీతిగా వయోజనులకు పఠనాభ్యాసం, ఆలోచనా విధానం మొదలైనవి అలవరచవగును

జానపద గేయాలు, భజనకీర్తనలు, దివ్యనామకీర్తనలు మొదలైనవాటిని ఆ తరగతులలో వినియోగిస్తే బాగుంటుంది. వయోజనులలో ప్రతి ఒక్కరి కంఠస్వరాన్ని మొదట పరిశీలించి, ఆ తరువాత జతలు జతలుగాను ఆటుపిమ్మట చిన్న చిన్న సంఘాలుగాను ఏర్పడి పాట పాడేపద్ధతి సమలుపరచాలి. తుదకు అందరూ కలిసి ఒకే శ్రుతిలో పాడగల పాటవం అలవరచాలి

వాయిద్యాలను సులభంగా పలికించగల రాగాలను వారికి నేర్పవచ్చు జలతరంగం ఈ పనికి బాగా ఉపయోగపడగలదు కృతియుక్తాభ్యాసం సులభంగా అమలుపరచవచ్చు వాయిద్యాల నుపయోగించే అవకాశం లభించినప్పుడు వయోజనులు చాలా సంతోషిస్తారు ఆ వాయిద్యంపై వారికి నేర్పగల సులభపద్ధతు లనేకం ఉన్నవి

## సంగీత చిత్రాలు

సంగీత చిత్రాలు తయారుచేయాలి భారతదేశంలో సంగీతశాస్త్రంలో ప్రసిద్ధిగాంచిన ప్రాంతాలను ఆ ప్రాంతాలలోని సుప్రసిద్ధ సంగీత విద్వాంసుల పేర్లను ఆయా ప్రాంతాలలో ఇప్పటికీ సంగీతశాస్త్రంలో ప్రసిద్ధిగాంచినవాటిని ప్రత్యేకంగాను సుప్రసిద్ధ గానశ్లోక రచయితల జన్మస్థలాలను ఆ చిత్రంలో చక్కగా చిత్రించి వయోజన తరగతులలో వాటిని ఉపయోగించాలి

భారతదేశం ఓషధులకు ప్రపంచ ప్రఖ్యాతి గాంచినది ఆ ఓషధులను వాడుకను వివరించే పాటలనేకం ఉన్నవి వాటిని వయోజనులకు వశాప్రియంగా నేర్పాలి ముగ్గులలో అనేక పద్ధతులున్నవి. సంగీతం పాడుతూ ముగ్గులు పెట్టడం, ముగ్గుల రూపంలో (ఉదాహరణకు స్వస్తిక రూపంలో) జనం నిలబడి పాటలు పాడడం చాలా ఆనందదాయకంగా ఉంటుంది వారివారి అభిరుచులనుబట్టి బహిరంగ (వీధి) నాటకాలు, కోలాటం నృత్యనాటకం మొదలైనవాటిని ఏర్పాటు చేయవచ్చు

## ప్రభుత్వ బాధ్యత

సంచార సంగీతాచార్యుల దళాల పర్యటన కయ్యే ఖర్చులను ప్రభుత్వం భరించటం అవసరం ఒక్కొక్క దళం ఒక్కొక్క గ్రామంలో రెండేసి నెలలుండే ఏర్పాటు చెయ్యాలి అలా వారు గ్రామాలలో ఉన్నప్పుడు కేవలం సంగీతమే గాక, లోకజ్ఞానం కూడా వయోజనులకు పాటల ద్వారా బోధించవచ్చు ఆ సంగీతాచార్యులు తమతో కొన్ని వాయిద్యాలు కూడా తీసుకుపోయి గ్రామస్థులకు వాటినిగురించి బోధించి గమకం మొదలైనవాటిని కొంతవరకు నేర్పవచ్చు కొన్ని చిత్రాలను కూడా వారు తమతోపాటు గ్రామాలకు తీసుకుపోయి చరిత్రలు మొదలైనవాటిని గ్రామస్థులకు వివరంగా తెలియచేయవచ్చు భావాలను, రాగాలను విశదపరిచే చిత్రాలను కూడా వయోజన తరగతులలో ఉపయోగించాలి ఆ విధంగా ఒక దళంవారు ఒక గ్రామంలో కొంత బోధన కావించిన తరువాత మరొక దళంవారా గ్రామంవెళ్లి మిగతా విషయాలను ఆ గ్రామంలోని వయోజనులకు నేర్పే ఏర్పాటు చేయవచ్చు

ఆ విధమైన సంచార సంగీత బోధనాచార్యుల దళాల నేర్పరచి, వారికి కావలసిన సాధనసంపత్తి నంత సమకూర్చగలిగితే, వయోజన విద్య సర్వతోముఖాభివృద్ధి నొందగలదు.

—సౌభాగ్య (జనవరి 68)

కిన్నెర



బ్రహ్మోమల్ (బ్రహ్మీలతా హేరాయిల్)

చక్కని వాసన గలది శిరోజములను పెంపొందించి మెదడును చల్లగ నుంచును అనేక వనమూలికలు సువాసన ద్రవ్యములు మొదలైనవాటితో తయారుచేయబడినది వ్యాపారవివరాలకై వ్రాయవచ్చును

డిస్ట్రిబ్యూటర్సు

ది న్యూ స్టార్ అండ్ కంపెనీ

(నెం 8 బవ్ కెర్ మిచన్) తండియార్పేట, మద్రాసు

# కొన్ని పత్రికలు

THE INDO-ASIAN CULTURE ది (ఇండో - ఏషియన్ కల్చర్) న్యూఢిల్లీ జనవరి 53 Some Aspects of Indo-Kambuja Culture. రచన డాక్టర్ ఆర్ సి మజుందార్

కంబోడియాలోను కొచ్చిన్-చైనాలోను దొరికిన సంస్కృత శాసనాల ఆధారంగా తెలియగల విషయాలనుగూర్చి చర్చించు వ్యాసం ఈ రచయిత సంపాదకత్వాన ఆ శాసనాలన్నీ గ్రంథ రూపంలో వెలువడనున్నవి సంస్కృత మూలంతోను ఇంగ్లీషు నోట్సు, ఉపోద్ఘాతంతోను ఈ పుస్తకాన్ని కలకత్తాలోని ఏషియాటిక్ సొసయిటీ త్వరలోనే ప్రకటింపనున్నది

MODERN REVIEW (మోడరన్ రివ్యూ) కలకత్తా జనవరి 53 Population Planning in India రచన ప్రొఫెసర్ ఏ బి మహోరియా ఎం ఏ ఎం కాం

కల్పనా (హిందీ) హైదరాబాదు దక్కన్ జనవరి 53 "కోమలతా సే కఠోరతా కీ ఓర్" రచన రామధారీ సింహ "దినకర్"

గృహలక్ష్మి, మద్రాసు జనవరి 53 "శాస్త్రీయ హిందుస్తానీ సంగీతము—దాని ఉత్పత్తి" రచన శ్రీమతి వంగలవాణీబాయి

తెలుగు స్వతంత్ర, మద్రాసు 23 జనవరి 53 "ఆంధ్ర కళాభిమానుల కర్తవ్యం" రచన శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మ

భారతి, మద్రాసు జనవరి 53 "పాల్కురికి సోమనాథుని కాలము" రచన శ్రీ శిష్టా రామకృష్ణశాస్త్రిగారు


## ఇంగ్లీషు విద్యాబోధిని

ఒకరి సహాయ మక్కరలేకయే ఆంగ్లభాషను తేలికగ నేర్చుకొనుటకు వీలుగ వ్రాయబడినది. 30 దినములలో మంచి భాషాజ్ఞానమును నేర్చవచ్చును వెల 1-00

ఆధునిక కామశాస్త్రము

స్త్రీ పురుషులకు సంబంధించిన అనేక రహస్య విషయములు, పాశ్చాత్యుల పద్ధతులు మున్నగునవి విపులీకరింపబడినవి. వెల 2-0-0 పోస్టుఖర్చు వేరు

ఈశ్వరి అండ్ కో

పోస్టుబాక్సు 139 - మద్రాసు 1

VIJAYA'S THREE GEMS

ASOKA

AMLA VEPA BRAHMI

VEGETABLE HAIR OILS









MEDICATED & DELIGHTFULLY PERFUMED HAIR TONICS

VIJAYA CHEMICAL & TOILET WORKS

"VIJAYA MANSIONS"

15, CLEMENS ROAD, PURASAWALKAM, MADRAS 7.

విజయా రత్నత్రయము

అశోకా ఆమ్లా, వేప, బ్రహ్మి హేరాయిల్సు

అనాదిగా భారతీయులచే పై మూడు (ఆమ్లా వేప బ్రహ్మి) వృక్షములు పూజింపబడుచున్నవి యేలనవగా వీటియందుగల అమూల్యమైన ఓషధీగుణమే కారణము. ఈ అమూల్య గుణములను కోరువారు ఈ ఓషధులతో తయారు చేయబడిన పై హేరాయిల్సును ఉపయోగించిన పై గుణమేకాక యింపగు పరిమళమును పొందగలరు శిరోజ పోషణకు - మెదడు కన్నులకు - చల్లదనము నిచ్చుటలో సాటిలేనివి

విజయా కెమికల్స్,

15, క్లైమన్సు రోడ్డు, పురసవాక్కం, మదరాసు-7

# హరిగోలు

వై. అశ్వత్థ నారాయణశర్మ

[రాయలసీమలోనూ హైదరాబాదు రాష్ట్రంలోనూ కొన్నికొన్నిచోట్ల నదులను దాటుటకు "హరిగోలు"ను ఉపయోగిస్తారు తెలుగు దేశం లోని కోస్తాజిల్లాలలో నదులను రేవులను దాటుటకు చిన్నచిన్న పడవలను నావలను బల్లకట్లను ఉపయోగిస్తారు మన కీ నావలు, బల్లకట్లు ఏలాగు ఉపయోగపడుతున్నాయో అదేవిధంగా అచ్చటి ప్రాంతాలవారికి ఈ హరిగోలున్నూ ఉపయోగపడుతున్నవి. "పుట్టి మునుగుట" అను వాడుక కొన్ని జిల్లాలలో వింటూన్నాము ఆ పుట్టి" అనేది ఈ హరిగోలే ఈ హరిగోలల వాడుక హైదరాబాదు, రాయలసీమలలో ఈనాటికి కానవస్తున్నది ]

హరిగోలు కర్నూలు, బళ్లారి జిల్లాల లోనూ, రాయచూరు జిల్లాలోనూ తుంగ భద్రానది దాటుటకున్ను, అటు గుల్బర్గా రాయచూరు మహబూబ్‌నగర్ జిల్లాలలో కృష్ణానది దాటుటకున్ను యానపాత్రగావాడు తున్నారు దీనిని అరిగోలు అనికూడ అందురు దీనిని హిందీలోను, ఉర్దూలోను టోకరా అని అందురు టోకరా అనిన వెదురు దబ్బలతో అల్లిన గంప అని అర్థము కనుక తెలుగులోకూడ కొందరు పుట్టి అనియు గంప అనియు అనుచుందురు కాని విశే షముగా అరిగిలి అనియే వాడుకలో ఉన్నది ఇది తయారుచేయుటకు మూరు బొంగులు ఎద్దుచర్మములు పెద్దవి అయిదుకావలయును ఇది తయారుచేయుటకు అనుభవము ఉండ వలయును అనుభవజ్ఞులు కర్నూలు దగ్గర ఉండే "కాంద్రపాడు" అనుపల్లెలో ఉన్నారు ఈహరిగోలు నడుపువారు బెస్తకులమువా కాని వీరిని బెస్తలని పై జిల్లాలలో పిలువరు తెలుగువారనియు గంగాపుత్రులనియు పిలు తురు కొన్ని పల్లెలలో "అనకల"వారనియు కూడా పిలుతురు నదులలో మృగశిరకార్తెకి ప్రవాహం ప్రారంభమగును అప్పుడు కర్నూలు రేవునందు ఇరువదియైదు హరి గిండ్లకు తక్కువ ఉండవు మిగత చిన్న చిన్న పల్లెల రేవులయందు ఒకటి రెండు కంటె ఎక్కువ ఉండవు చిన్న రేవుల వారికి హరిగోలు తయారుచేసుకొను అను భవము తక్కువ కావున కర్నూలు వెళ్లి హరిగోలు ఖరీదుచేయుటయో లేక అచ్చట అనుభవజ్ఞులను తమ తావుకు పిలుచుకొని వచ్చి తయారు చేయించుకొనుటయో జరుగును

పడవలవలె ఇవి రహదారిగా దూరపు ప్రయాణాలకు ఉపయోగింపబడవు నది ఇవతలనుంచి అవతలి రేవులకు జనులు పశువులు సామగ్రి ధాన్యము మొదలగునవి దాటించుటకు ఉపయోగిస్తారు ఇప్పటి ధరలలో హరిగోలు తయారుచేయుటకు



హరిగోలు—నావికుడు

దాదాపు 350 లేక 400 రూపాయలగును దీనియందు కనీసము పందజనులు ఒక్క పర్యాయం ప్రయాణంచేయు అవకాశం ఉండును ధాన్యపు బరువు రెండు లేక మూడు టన్నులకు మించకుండ ఒక్కపర్యా యం దాటించవచ్చును పశువులు, మేకలు గొర్రెలు దాటించుటకు హరిగోలు లోపలి భాగమున ఈత దబ్బలతోగాని లేక వెదురు దబ్బలతోగాని గుండ్రముగాను మందము గాను అల్లిన తడిక అనగా దాపవేసి దాని పైని పశువులను ఎక్కించి దాటింతురు అట్లు తడిక వేయనిచో మున చర్మమునకు భారమగును పెద్దపెద్ద ఎద్దులు దున్న పోతులు దాటించబడలేనివిన వాటిని త్రాళ్లచే క్రిందపడవేసి నాలుగు కాళ్లను బంధించి మనుష్యుల బలముచే హరిగోలులో వేసి అవతల రేవుకు వెళ్లినవెంటనే వదులుదురు

వాడుటకు ఒక పర్యాయము ఈ హరి గోలును నీరలవేసి బొబ్బాకు అను ఒక పత్రచూర్ణమును నీటిలో నానవేసి బాగుగా నానిన ఆ చూర్ణమును హరిగోలు చర్మము నకు బాగుగా మర్దనచేసి, ఒకరాత్రి అంతయు చక్కగా ఆరవిచ్చెదరు మరునటి రోజు ఉదయము నదిలో హరిగోలు వెలికిల వేతురు ప్రతిరోజూ గంటకు రెండు పర్యా యములైనా ఆచర్మమును పది నిమిషాల పాటు నీటిలో తడుపుదురు అట్లు తడుపని యెడల చర్మము పగిలిపోవునుగాన ఈ విష



కి స్పై ర

యములో నావికులు చాలా జాగరూకతతో మెలగుదురు అట్లు వారు హరిగోలకు బొడ్పాకు రుద్దనియెడల చర్మం చెడిపోవును దీనిని రుద్దటంవల్ల చర్మం కరుకుబారి వారంరోజులవరకు నదుమగా ఉండగలదు బొడ్పాకు చాలా కష్టపడి సంపాదింతురు కర్నూలు జిల్లాలోని నందికొట్కూరు తాలూకా సప్తనదీ సంగమేశ్వరం దగ్గర కృష్ణానదిలో అగాధమయిన గండ్లు గలవు ఆ గండ్ల మధ్యన చిన్నచిన్న చెట్లు ఉండును ఆ చెట్లకు ముండ్లుకూడా ఉండును తుమ్మాకు వలె ఈబొడ్పాకు చాలాచిన్నదిగా ఉండును అతి ప్రయాసతో ఈ ఆకు తీసుకువచ్చి భద్రముగా దాచి ఉంతురు ఈ ఆకు ధర దాదాపు ఒక సౌను ఒక రూపాయ ఉండగలదు హరిగోలు నడుపు ప్రతివారి ఇంటిలో ఈ పత్రచూర్ణము నిలువచేసి ఉంచుకుందురు

నావికులు నదిదాటుటకు అర్ధప్రవాహములో వెదురుగడ నుపయోగింతురు ఇతర ఆధారం లేకనే అగడ ఆధారంచేతనే హరిగోలు సులభముగా నడవగలదు ఈ గడ వేయుట అందరికి తెలియదు గడ వేయుటలో ఎక్కువగా శరీరబలం ఉపయోగింపవలెను తెలియనివారు గడవేసినచో హరిగోలు గిరగిర తిరుగునుగాని ముందుకు పోజాలదు ఆషాఢ శ్రావణ భాద్రపదములలో నదులు పూర్ణప్రవాహముగా ప్రవహించును అప్పుడు వెదురుగడ ఉపయోగపడజాలదు ఎందుకన ప్రవాహములోతు వెదురుగడకు మించి ఉండగలదు కావున అప్పుడు తెడ్లను ఉపయోగింతురు ఇది ఒక అడుగు వెడల్పు మూడు అడుగుల పొడవు గలిగి, పైభాగమున పట్టుకొనుటకు పిడిగా గుండ్రముగా చెక్కబడిఉండును ఈ తెడ్లను టేకు కర్రతో తయారుచేయుదురు ఇందులోకూడా ఒక విశేషమున్నది ఆయా రేవులలో తరుచుగా దాటు శ్రీమంతులు, లేక వ్యాపారస్థులు తమపేర జ్ఞాపకార్థమై ఈపలకలను ఉచితముగా నావికులకు ఇప్పింతురు ఇప్పించుటయేకాక తమ పూర్తివిలాసమును ఇచ్చిన తేదీని ఒకవెండిరేకుపైని చెక్కించి ఆ పలకలకు కరిపింతురు ఇట్టితెడ్లు ప్రతిరేవులో ప్రయాణీకులకు అగుపడుచుండును



తుంగభద్రానదిని దాటుతున్న హరిగోలు దృశ్యం

పూర్ణప్రవాహములో నావికులు తమ నడుములకు "కాయదట్టి" అను దృఢమైన బట్ట పన్నెండు మూరలుకలది గట్టిగా బిగించి భద్రముగా హరిగోలలో కూర్చొని నదిలోనికి వంగి ఆ పలకలను ఎదనువైపునకు రెండుచేతులు బలముగా లాగుదురు అట్లు లాగుటలో మోటారు స్పీడువలె వేగంగా హరిగోలు నడవగలదు ఎదురుకర్రతో నడిపిన హరిగోలు ఈ రేవుకు ఆ రేవుకు చక్కగా వెళ్లగలదు కాని పూర్ణప్రవాహపు రోజులలో విశేషించి గాలి పశ్చిమమునుండి బలముగావచ్చుచున్నను నలుగురు నావికులు పలకలు ఆడించినను అటుప్రక్కరేవు చేరుటకు కనీసం మూడు ఫర్లాంగులు క్రిందికిపోయి హరిగోలు దిగును జనమును దింపినతరువాత నావికులు హరిగోలను పైకి లాగుకొనివత్తురు

నావికులు మామూలుగా దాటు ప్రయాణీకులతో ఒక్కసారి దాటుటకు నాలుగు అణాలు వసూలుచేయుదురు దాతలగు శ్రీమంతులుగాని పెండ్లివారుగాని దాటవలసినచో వారిని పీడించి ఇనాంక్రింద అయిదు పది రూపాయలు వసూలు చేసుకొనుచుందురు పల్లెటూరు రేవులలో నావికులు రైతులను మాత్రం డబ్బుతీసు కొనకుండగ దాటింతురు ఆ రైతులు తమ హంగామీ ధాన్యపు కళ్ళములలో నావికులకు జొన్నలు, కొర్రలు వడ్లు వారి కష్టముకొద్దీ ఇచ్చుచుందురు

ఇదేకాక పల్లెలలో పలుకుబడి కలిగినవారి ఇండ్లలో వివాహములైనా లేక క్రొత్తగా అల్లుడు వచ్చినా లేక జాతరలు వగైరా జనసమ్మర్దమగు సమయములందు నావికులు గౌరవనీయులందరిని హరిగోలలో ఎక్కించి నదిప్రవాహమునకు హరిగోలను తీసుకపోయి గిరగిర గోలు త్రిప్పుదురు తెడ్లు ఒకే ప్రక్కకే లాగుతూఉండిన రంగులరాట్నము వలె గిరగిర అతివేగంగా తిరుగగలదు కాని భయం ఏమాత్రం లేదు ఒక అర్ధ గంటవరకు ఈవిధముగానే త్రిప్పి తరువాత రేవుకు తీసుకొనివత్తురు వచ్చినవెంటనే హరిగోలలో కూర్చున్నవారివల్ల బహుమానములు బడయుదురు దానిలో కూర్చున్నవారికి అలవాటులేని క్రొత్తవారైనయెడల కండ్లు తిరిగి వాంతులుకూడా అగును

సంవత్సరమునకు ఒకటి రెండు పర్యాయములు ఈ గోలు త్రిప్పుదురు ఇదేకాక నావి

కుల కుంటి గ్రుడ్డి బీదసాదా జోగి జంగం—ఈలాటి బీద దగ్గర కాపీ తీసుకొనకుండా దాటించి పుణ్యము గట్టుకొనుచుందురు ఈ నావికులు హరిగోలు వేయుటలో ఎక్కువగా సాహసం బలం చూపుదురుగాన వీరి శరీరములు మహాబలం కలిగినవిగా ఉండును వీరు ప్రతిరోజూ సంపాదించిన డబ్బు సగమునకు పైగా త్రాగుటకు ఉపయోగింతురు త్రాగుడులేనిదే మేము హరిగోలు నడపలేమని వారు నిక్కచ్చిగా పలుకుదురు

నిజాం సరిహద్దు రేవులలో గవర్నమెంటువారు కంట్రాక్టువేలం వేయింతురు ఆ పాటలో కొన్ని రేవులు ఒక కంట్రాక్టరు కొంత మొత్తంకట్టి తనపేర పెట్టుకొని తీసుకొనును నావికులు వసూలుచేయు వాళ్ల అణాలలో సగం కంట్రాక్టరు తీసుకొనును తక్కిన సగం నావికులకు మిగులును కొన్ని రేవులలో కంట్రాక్టరే డబ్బు ఖర్చుపెట్టి హరిగిండ్లు తయారుచేయించి నావికులకు కొద్దిభాగమో లేక నెలజీతమో ఇచ్చు వాడుకకూడగలదు

కర్నూలు జిల్లా నందికొట్కూరు తాలూకాలో మూర్వకొండ అను గ్రామము ఒక గొప్ప రేవు ఇది మహానాటి మార్గం కర్నూలునుండి మూర్వకొండవరకు రోజూ నాలుగు మోటారుబస్సులు వచ్చుపోవును వెళ్లును ఆ ప్రయాణీకులు నదిదాటి జడ్చర్ల సంస్థానంలోచేరిన పెంట్లవెల్లి కొల్లాపురం అను పెద్ద గ్రామాలలో వ్యాపారానికై ఎక్కువగా ఇటూ అటూ తిరుగుచుందురు వ్యాపారసామగ్రికూడా ప్రతిరోజూ కొన్ని లారీలతోవచ్చి రేవులో స్థిరముగావుండును ఇచ్చటి నావికులు భోజనానికి ఇబ్బందిలేకుండా సుఖముగా జీవనం చేయుచున్నారు వీరు కొద్దికొద్దిగా భూమి సంపాదించుకొని వ్యవసాయముకూడా చేసుకొనుచున్నారు ఇచ్చట రైలువలె టైమునకు హరిగోలు వేయుదురుగాన జనము చాలా కలియుచుందురు మిగతా రేవులలో పైవిధముగా ఒక్కొక్కరోజు హరిగోలు ఆగుటయే ఉండదు కర్నూలుదగ్గరమాత్రం రాత్రీపగలూ అనక హరిగిండ్లు తిరుగుచుండును ఒక్కొక్కప్పుడు రాత్రి రెండవ సినిమా వదలినతరువాతకూడా జనులు హరిగోలు దాటి తమ పల్లెలకు వచ్చుచుందురు

ఓడరేవులు తుంగభద్రలో ఆలంపురం దగ్గర ఉన్నవి అటునుండి ఉప్పలపాడు అను రేవునుంచీ శాతవాహనకోట అను పల్లెనుంచీ ఒక హరిగోలు వున్నది ఇక్కడ తుంగభద్ర సంగమేశ్వరందగ్గర కృష్ణలో కలిసినదిగాన తుంగభద్ర అని పేరు ఆగిపోయినది ఇంక కృష్ణలోకూడ వెల్లి దగ్గర రెండు హరిగిండ్లు వున్నవి రెండు మైళ్లు వెళ్ళిన సంగమేశ్వరందగ్గర తుంగభద్ర కలియును అచ్చట ప్రవాహము చాలా విస్తారంగాన రేవులు లేవు క్రిందకు మూడు మైళ్లు పోయిన మూర్వకొండ రేవు అచ్చట నాలుగు హరిగిండ్లు వున్నవి అచ్చటినుండి మరల అయిదు మైళ్ళవరకు రేవులు లేవు చివరి రేవు సిద్ధేశ్వరం ఇచ్చటనే పెద్ద సంగమేశ్వరం ఉన్నది దీనినే సప్తనదీసంగమేశ్వర మందురు ఇచ్చట భవనాశిని అను ఉపనది అహోబిల నరసింహ క్షేత్రమందు ఉద్భవించి ప్రవహించి, ఇచ్చట కృష్ణలో కలియుచున్నది కృష్ణానది ఇచ్చట ఒక కొండను తొలచుకొని వెళ్ళినది ఇన్ని నదులు కలసి ప్రవహించినను కృష్ణ ఇచ్చటి వెడల్పు చాలా తక్కువ లోతు ఎక్కువ

ఇచ్చటనే మద్రాసు గవర్నమెంటువారు కృష్ణా-పెన్నారు ప్రాజక్టు కట్టవలెనను తలంపుతో ప్రయత్నాలు చేయుచున్నారు ఈ ప్రాజెక్టే నిశ్చయమైనచో పవిత్ర క్షేత్రములయిన సప్తనదీసంగమేశ్వరుడు షణ్ణందీ సంగమేశ్వరుడు ప్రఖ్యాతిగడించిన ఆలంపూరు బాల బ్రహ్మేశ్వరుడు శాశ్వతముగా జలమయ మగుదురు అత్యద్భుత కట్టడములన్నియు గంగపాలు కాగలవు ఈ కొండ దాటి అవతలికి కృష్ణ వెళ్ళగా అచ్చట సిద్ధేశ్వరం అను పల్లె ఉన్నది అటువైపు సోమశిల లేక సోమేశ్వరం అను శైవక్షేత్రం కలదు ఇచ్చట ఒక్క హరిగోలు కలదు ఈ ప్రాంతదేశంలో ఇదియే చివరి రేవు ఇటునుండి కృష్ణ తూర్పుగా ప్రవహించి అడవిలో ప్రవేశించి జనులకు కనుపడదు అడవి చెంచులు కోయలు మొదలగువారు కృష్ణను చూతురేమోకాని మనబోటివారికి సాధ్యంకాదు తరువాత కృష్ణానదిని మనం చూడవలెనంటే శ్రీశైలక్షేత్రంలో పాతాళగంగ అనుపేర వుండిన కృష్ణానదిని చూడగలము అటునుండి మరల కొండలలో వెళ్ళి గుంటూరు జిల్లాలో కృష్ణ అగుపడగలదు అచ్చట నది దాటుటకు ఈ హరి

కి వ్మె ర



హరిగోలులో ప్రజ కూర్చుండి నదిని దాటుట

గిండ్లు ఉపయోగింతురు పడవలు, మర బోట్లు, లాంచీలు ఉపయోగింతురు కృష్ణా నదికి పశ్చిమున రాయచూరును, గుల్‌బర్గా జిల్లాలలో కొంతవరకే ఈ హరిగిండ్లు ఉపయోగింతురు ఆపైని పడవలనే వాడుదురు

రాయచూరుదగ్గర భీమానది కృష్ణలో కలియును ఆ భీమానదిలోకూడా పడవలే నడుపుదురు తుంగభద్రానదిలో హంపీ ఆనగొంది, తుంగభద్రా ప్రాజక్టువరకు ఈ హరిగిండ్లనే ఉపయోగించుచున్నారు కాని అచ్చటి హరిగిండ్లు కర్నూలుదగ్గర ఉండు నంతటి పెద్దవికావు వెదురు బొంగులకు బదులు ఎండిన పత్తిచెట్లు, ఇతరమైన కర్రలు ఉపయోగింతురు ఇవి చాలా చిన్నవియేకాక అంత దృఢముగాకూడా ఉండవు ఒక్కపర్యాయం 25—30 మంది కంటె ఎక్కువగా దాటించలేదు బళ్లారి జిల్లాలో రేవు కంట్రాక్టులు ధనికవర్గము చేతిలో వుండునుగాన ఒక ప్రయాణీకునికి ఒక్కసారి ఒకరూపాయ వసూలుచేతురు అచ్చట బీదప్రయాణీకుల పరిస్థితి అరణ్య రోదనముగా వుండును ఈ నిరంకుశం బళ్లారిజిల్లావరకే వున్నది కర్నూలుజిల్లాలో మాత్రం పూర్వపుచరిత్రకు సంబంధించిన నవాబులు ఆ కాలంలో నావికులకు రేవులు దానం ఇచ్చుచు ఆచంద్రతారార్కముగా అనుభవించునట్లు తామ్రశాసనాలు వ్రాసి ఇచ్చినారట అందుకొరకై కర్నూలుజిల్లావైపు వుండిన తుంగభద్ర కృష్ణ రేవులలో గవర్నమెంటు కంట్రాక్టర్లు లేరుగాన పూర్తి పరుమానం నావికులకే దక్కినది

ఈ నావికులు సంవత్సరమున కొకతూరి గంగమ్మ అను దేవతను సమస్త వాయిద్యములతోసహా పూజింతురు ఆ పేరు పైని తమచుట్టుపట్ల గ్రామముల రైతుల నుండి, వ్యాపారస్థులనుండి, శ్రీమంతుల నుండి ప్రయాణీకులనుండి దండిగా డబ్బు వసూలుచేసికొందురు రెండు తేలిక కర్ర లతో చిన్న తెప్పకట్టి గోధుమపిండితో ఒక జ్యోతిచేసి దానిలో దీపముపెట్టి దానికి వస్త్ర, గంధ పుష్ప ధూప దీప నైవేద్య హారతులు ఇచ్చి జంతుబలినొసగి గొప్ప ఉత్సవముతో ఆ తెప్పను నదిలో వదలుదురు ఇది ప్రతిసంవత్సరము ఒక్కతూరి చేయుచుందురు

మార్గశిరం రాగానే నదుల ప్రవాహం పూర్తిగా తగ్గును అప్పుడు హరిగోలు ఆధారంలేకనే ప్రజలు నీటిలో దాటగలరు కావున నావికులు హరిగోలను విప్పివేయుదురు హరిగోలునుండి చర్మం వేరుగాచేసి దానినిండుగా పొట్టుకు రుద్ది ఆ చర్మాన్ని మడతలువేసి తమ ఇండ్లయందు భద్రముగా దాచివుంతురు మరల వర్షాలు ప్రారంభమై మృగశిరకార్తి రాగానే నదులు ప్రవహించుట ప్రారంభమగును అప్పుడు మరల హరిగోలు చర్మాన్ని ఒకరోజు నానవేసి తిరిగి తయారుచేయుదురు క్రొత్తగా తయారు చేసిన హరిగోలుచర్మం ఆ నావికునియొక్క జాగ్రత్తనుబట్టి ఆ చర్మానికి అతడు చేసిన పోషణమునుబట్టి అదే చర్మము మూడు సంవత్సరములవరకు ఉపయోగపడగలదు నావికుడు దానిని అశ్రద్ధచేసిన ఒక్క సంవత్సరంలోనే పాడుకాగలదు కాన నావికులు అతిజాగ్రత్తతో చర్మమును కాపాడుచుందురు

ఈ హరిగోలులను తయారుచేయుటలో నావికులకు చర్మవృత్తిచే జీవించు హరిజనుల సహాయ మవసరము ఆ హరిజనులకు కూడా కుట్టుపనిలో అఖండమైన ప్రజ్ఞ ఉండును లేనియెడల కుట్టుదోష మేమాత్ర మున్నను హరిగోలు పనికిరాదు ఇదియే అనంతపురము కర్నూలు ప్రాంతములలో వుండిన హరిగోలు యను యానపాత్రయొక్క సూక్ష్మచరిత్ర





ఉచితము
కాశ్మీరి శాస్త్రం

ఇదుగో, మీకు కావలసిన పుస్తకం ఇందులో స్త్రీ పురుషుల రంగుల ఫోటోలు 284 ఉన్నవి ప్రకటన ఖర్చులకుగాను 8 అణాలు పంపుతూ ఫ్రీ కాపీకి వ్రాయండి త్వరపడండి లేనియెడల మీ అవకాశం పోగొట్టుకొనగలరు

Paris Art House, Halqa 5 (D—204) AMRITASAR




## అలంపురం సాహిత్య సభలు

ఎగ సమావేశంలో ప్రముఖుల అభినందన

చరిత్రకు ఆటపట్టయి శిల్పకళాలక్ష్మికి నృత్యరంగమయి సరస్వతీదేవికి కళాపీఠమయి పెంపొందిన అలంపురంలో ఇటీవల జరిగిన హైదరాబాదు ఆంధ్ర సారస్వత పరిషత్తు సప్తమ వార్షికోత్సవాలను గురించి ది 25-1-53 ఆదివారం సాయంకాలం "కిన్నెర" కార్యాలయంలో ఒక సభ జరిగింది

శ్రీ మల్లికార్జునరావుగారు చారిత్రకంగాను సాంస్కృతికంగాను అలంపురానికిగల ప్రశస్తినిగూర్చి చెప్పుతూ అలంపురంలోని శిల్పకళావిశిష్టతను గూర్చియు శిల్ప రీతులను గూర్చియు ముచ్చటించారు అలంపురంలో వివిధ దేవాలయాలలోను ఇతరత్రాను చెదరివడియున్న శాసనాలనుగూర్చియు అక్కడ లభ్యమయిన శిల్పకళా ఖండాలనుగూర్చియు వివరించి తెలియజెప్పారు హైదరాబాదు ఆంధ్ర సారస్వత పరిషత్తువారి కృషిని ప్రశంసించారు

డాక్టర్ గిడుగు సీతాపతిగారు అలంపురంలో జరిగిన వివిధ సమావేశాలనుగూర్చి వివరంగా తెలియజెప్పుతూ ముఖ్యమయిన కొన్ని ఉపన్యాసకుల ప్రసంగాలను తెలియజెప్పారు ఆంధ్రసారస్వత పరిషత్తువారు చేసిన ఏర్పాటులను కవిసమ్మేళనాన్ని గురించి ఆంధ్ర కళాపరిషత్తు స్థాపనమగురించి ప్రసంగించారు

శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు తెలంగాణంయొక్క చారిత్రక విశేషాన్ని తెలియజెపుతూ, గత ఏభయి సంవత్సరాల నుంచీ అక్కడ ఆంధ్రోద్యమమూ సారస్వతోద్యమమూ ఏవిధంగా పరిణమిల్లిందీని విశదీకరించారు పోలీసు చర్యకుముందూ, తర్వాత కూడా ఆంధ్రసారస్వత పరిషత్తువారు చేసినకృషినీ తెలంగాణాలోని ఉద్యమాలకు బాధ్యులయినవారినీ కర్తలనూ గూర్చి విపులంగా ప్రసంగించారు

శ్రీ యండమూరి సత్యనారాయణ రావుగారి వందనసమర్పణంతో సభ ముగిసింది

## ప్రాచీన గ్రంథ పరిష్కరణం

శ్రీ బులుసు వేంకటరమణయ్యగారి ప్రసంగం

భాషాసేవక సమితి యాజమాన్యాన జరిగిన గోష్ఠిలో శ్రీ వేంకటరమణయ్యగారు ప్రాచీన గ్రంథపరిష్కరణ విషయంలోని లోతుపాతులను గురించి ప్రసంగించారు

ప్రాచీన గ్రంథపరిష్కరణం తేలికపనికాదని దానిలోచాలా చిక్కులున్నవని గ్రంథపరిష్కరణానికి సంప్రదాయజ్ఞానం, చారిత్రకదృష్టి భాషాజ్ఞానం చాలా అవసరమని, అవి లేకుంటే భాషా స్వభావమే తల్లక్రిందులు కాగలదని హెచ్చరించారు

ఇలాటి గ్రంథ పరిష్కరణలో శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు సమర్థులనీ, వారెన్నో గ్రంథ గ్రంథులను వివరించి భాషాసేవ చేశారనీ కొనియాడారు

సంస్కృత కావ్యాలను తెలిగించడంలో తొందరపాటువల్ల ఎన్ని దోషాలు దొర్లినవో వివరించారు

నేడు ముద్రణలో నున్న పాఠాలను, వానిలోని మంచిచెడ్డలను వివరించారు దేశంలోని ఒక్కొక్క గ్రంథానికి దొరికే అన్ని ప్రతులను పరిశీలించి సరియైన పాఠనిర్ణయానికి రావడం ఎంతైనా అవసరం కనీసం ఆ పని కవిత్రయంవారి భారతానికైనా జరగాలన్నారు నేడు ముద్రణలో వున్న కొన్నిరూపాలను, వాటి సరియైన పాఠాలను వివరిస్తూ వాఙ్మయంలో కొన్ని సింహావలోకనం చేశారు అలాటి అపపాఠాలు వ్యాకర్తలనే తికమక పెట్టిందని తెలిపారు

ప్రాచీన గ్రంథపరిష్కరణం చాలా చిక్కుతో కూడినపని గ్రంథపరిష్కరణం సరిగా వుంటేనేగాని భాషాబోధం స్థిరంగా నిలువదన్నారు

శ్రీ తిమ్మావజ్ఝల కోదండరామయ్యగారి వందన సమర్పణతో సభ ముగిసింది

# Tonsillitis?

## Avoid surgeon's knife




A regular course of 'Tonsinol' pills and painting the throat with the special Tonsinol solution radically cures the enlarged tonsils and adenoids. A safe specific for children and grown-ups. Thousands of satisfied patients and their doctors have acclaimed it as the only known cure for tonsillitis

Try Tonsinol before you resort to surgical operation

# TONSINOL

**CURES ENLARGED AND SEPTIC TONSILS WITHOUT OPERATION.**

Available at all chemists or write direct to

40 days course Rs. 9/-
20 days' course Rs 5/-

**TONSINOL LABORATORY,** 53, Govindappa Naick St, G.T Madras I

Every order should follow 50% as advance

"NO RELAPSE THOUGH 10 YEARS PASSED'

B. S Murthy M P Madras,

Writes —

I have tried Tonsinol and Nostrinol for my sister Srimati K. RAJYA-LAKSHMI in the year 1941 for enlarged Tonsils and Nasal-Growth. She was completely cured and since then there is no relapse

I have great pleasure in strongly recommending the Tonsinol and Nostrinol medicines for the suffering humanity as they are efficacious harmless and saves patients from the pains of operation.

(Sd) B S. MURTHY

టెలిఫోన్ 2729 — టెలిగ్రాం టాన్‌సినాల్

# టాన్‌సినాల్ (రిజిష్టర్డ్)

సమస్తమైన గొంతు కండలకు అమోఘమైన దివ్యౌషధము

## 23,500 టాన్‌సిల్సు కేసులకు పైగా నయము చేయబడిన

40 దినములకు 9-0-0, 20 దినములకు 5-0-0 — వి పి చార్జి 1-0-0

# నాస్ట్రినాల్

ముక్కులో కండలు పెరిగి శ్వాసకు అడ్డుపడటం వాసన సరిగ్గా తెలియకపోవటం, మాటికి మాటికి చీదటం, తుమ్ములు ఎక్కువగా రావటం, పీటిమూలాన వచ్చే తలనొప్పి, వగైరా మొదలైనవాటిని అమోఘంగా కుదుర్చుతుంది నాస్ట్రినాల్ దీన్ని చిన్నవారు, పెద్దవారు స్త్రీ పురుష విచక్షణలేకుండా వాడవచ్చు వెంటనే గుణమిస్తుంది

పెద్దబుడ్డి వెల రు 4-8-0 చిన్నబుడ్డి వెల రు 2-8-0 వి పి చార్జీ వేరు

ఆర్డరుతో సగంసొమ్ము అడ్వాన్సుగా పంపించాలి మా మందులు అన్నిషాపులలోనూ దొరకును

చీఫ్ స్టాకిస్టు దాదా అండ్ కో కెమిస్ట్సు అండ్ డ్రగ్గిస్ట్సు.
నైనియప్ప నాయకన్ స్ట్రీట్, మెడ్రాస్ 3

కావలసినవారు **టాన్‌సినాల్ లేబరేటరి**
53, గోవిందప్ప నాయకన్ వీధి, జి టి మదరాసు - 1



ఆ ఇద్దరు పాపల ఆటలూ, పాటలూ చూచి

ఆ తల్లి మురిసిపోతోంది

ఆ తల్లి ఆరోగ్యంగా ఉండటంవల్లే

అంత చక్కని పిల్లలు పుట్టేరు

ఆమె ఆరోగ్యానికి ప్రతిరోజూ

ఏమిటి చేర్చుకుంటుందో తెలుసా?

## లోధ్ర

కేసరి కుటీరం లిమిటెడ్

రాయపేట, మదరాసు-14

## రూ. 2500 ఉచితము

### మీరు కోరినది పొందండి



ఏ విపుడేమి బెంగపడ నక్కరలేదు ఈ ఉంగరం ధరించుటవలన అన్నింటిలోను జయము పొందవచ్చు ఎంతటి పాషాణహృదయంగల స్త్రీ పురుషులైననూ స్వాధీనమై నిన్ను ప్రేమించుటయేగాక నీ పాదదాస్యము చేయుచు నిత్యము నీకు దాసులై సంచరించును వ్యాపారము పందెము, పరీక్షలు మొదలైనవాటిలో ఇది జయము చేకూర్చును గొడ్రాలికి పుత్రుడుదయించును చనిపోయిన వారితో సంభాషించవచ్చు తాత తండ్రులు దాచిన రహస్య ధనముల సంగతి నీకు కలలో తెలియచేయును దుష్టనక్షత్రాల చెడుఫలాలను అణచివేసి, అపాయకరమైన రోగాలనుంచి రక్షించును ఇటు సూర్యుడటు ఉదయించవచ్చు గాని ఈ ఉంగరం శక్తి ఎన్నడూ వృధాకాదు నూటికి 100 పాళ్ల విజయం లభించును వెల 12 అణాలు ప్రత్యేకం రూ 2 ఇంకా ప్రత్యేకాధిక్యమైన శక్తివంతమైనది 2-12-0

ఇది అబద్ధమని రుజావు చేసినవారికి రూ 1500 బహుమతి ఇవ్వబడును నచ్చనిచో ధనం వాపసు చేయబడును ఇంగ్లీషులోనే ఉత్తర ప్రత్యుత్తరాలు జరపండి

BENGAL MAGIC HOUSE, Sikh Temple, (Dept 289/16) AMRITSAR

# పుస్తక సమీక్ష

(రివ్యూకై రెండు ప్రతులు పంపాలి)

## ఆనా కెరినినా
### (న వ ల)

రచన టాల్‌స్టాయ్ అనువాదం శ్రీ శాపీ ధర్మారావుగారు ప్రచురణ ఇంటింటి విజ్ఞానమాల 16 జోన్స్ స్ట్రీట్ మద్రాసు 1 వెల ఆరు రూపాయిలు పుటలు 464

"సుఖంగా ఉండే కుటుంబాలన్నీ ఒక్కలాగే ఉంటాయి. సుఖం లేని కుటుంబాలలో దేనికష్టాలు దానివి.

అబ్లాన్స్కీ ఇంటిలోని ప్రతివిషయం అయోమయంగా ఉంది ఇదివరకు ఉపాధ్యాయురాలుగా వున్న ఒక ఫ్రెంచి యువతితో తన భర్తకు కొంత సంబంధముందని అతని భార్య కని పెట్టింది ఇక ఆ యింటిలో అతనితో కలిసి కాపురం చేయనని అబ్లాన్స్కీతో కచ్చితంగా చెప్పింది. భార్యాభర్తలేకాక ఆ యింటి పరివార మంతా బాధపడ్డారు. అందరూ ఇక ఒకచోట కలిసివుండడంలో అర్థంలేదనుకున్నారు. సత్రాలలో అప్పటికప్పుడు కలుసుకునేవాళ్లుకూడా తమ కన్నా వయమని అబ్లాన్స్కీ కుటుంబంలోని వారంతా అనుకునేవారు భార్య తన గదిని విడిచి పెట్టలేదు మూడు రోజులైనా భర్త యింటికి రాలేదు. పిల్లలు యిల్లంతా కలియతిరుగుతున్నారు ఇంటిలోని ఆంగ్ల ఉపాధ్యాయిని, ఇంటి పరిచారకునితో పోట్లాడి, తనకేదైనా కొత్త ఉద్యోగం చూడమని తన స్నేహితురాలికి ఉత్తరం వ్రాసింది వంటవాడు భోజనాలు కాకుండానే ఇల్లువిడిచి పోయాడు గుర్రపుబండి తోలేవాడు, వంటకత్తె నౌకరీ మానుకుంటామని తెలియచేశారు."

ఇది అనా కెరినినా నవలలో ప్రారంభ వాక్యాలు ఎంత అద్భుతమైన ప్రారంభం ఇది ఇలాగ ..తి లోకి మాటిగా చొచ్చుకుపోగలతం విడంగా ర.. యిత కథాకథన సామర్థ్యానికి మంచి నిదర్శనం దీనిని రచించింది ప్రఖ్యాత రష్యన్ రచయిత టాల్‌స్టాయ్ అనువదించింది ప్రఖ్యాత ఆంధ్ర రచయిత శ్రీ శాపీ ధర్మారావుగారు

టాల్‌స్టాయి ఖ్యాతి కేవలం రష్యాకే పరిమితమైంది కాదు ప్రపంచ సాహిత్యంలోనే మహోన్నత స్థానాన్ని సంపాదించుకున్న ప్రముఖుడు ఆయన ఈనవల అన్నింటిలోకి అనా కెరినినా శిరోభూషణమైందిగా పేరొందింది

ఇది ఒకమాదిరిగా 1870 ప్రాంతాలలో రష్యన్ ప్రజల సాంఘిక జీవితానికి దర్పణం వంటిదని చెప్పవచ్చు.

దీని ఇతివృత్తం వాస్తవంగా జరిగిందే 1878 లో టాల్‌స్టాయి ఇరుగు పొరుగున నివసిస్తున్న బిబికోక అనే భూస్వామితో నివసిస్తున్న అనా అనే అవిత రైలుక్రిందపడి ఆత్మహత్య చేసుకుంది ఈ రైలు తన ఇంటిలోనేవున్నా ఒక దానిని పరిగానన్న అసూయతో అనా తన నిండుప్రాణాన్ని విలువునా తీసుకుంది ఈవిధ శవపంచాయతీకి టాల్‌స్టాయ్‌కూడా వెళ్లాడు అదంతా వినేసరికి కరుణార్ద్రహృదయుడైన మహాకవి గుండె చెదపైపోయి ది ఆ సంఘటనలు ఇతివృత్తంగా దీని రచన ప్రారంభమైంది

టాల్‌స్టాయ్ పుస్తకాలు ఎమైనాసరే చదివి చదవండి అది యుద్ధమూ శాంతి" కానివ్వండి "వర్గ్యాత్రావం" కానివ్వండి ఈ "అనా కెరినినా"నే కానివ్వండి ఏది తీసుకున్నాసరే అందులో మనకి ప్రపంచం నగ్నస్వరూపం కనబడకమానదు. లోకంలో మానవులు పొందే వ్యథ నిరాశ నిస్పృహ అన్నీ ఆయన రచనలలో కళ్ళకు కట్టినట్టుంటాయి

ఆయన పాత్రలు వాటి పరిసర వాతావరణం మనలో ఎంతో ఆలోచనకు పురికొల్పుతాయి ఆయన రచనలు మనలో నూతన జాగృతిని కల్పిస్తాయి కార్యపరతంత్రతను ప్రేరేపిస్తాయి

తను సంపన్నకుటుంబంలో పుట్టినప్పటికీ దాని సం బీదల సమస్యలను పూర్తిగా అర్థంగా చేసుకొని వాటి పరిష్కారానికి మార్గాలనుగురించి ఎంతో మథనపడ్డ కరుణాశాలి కనుకనే ఆయన రచనలు విశ్వసాహితికి వన్నెతేవడమేకాకుండా శాశ్వతత్వాన్నికూడా సంతరించుకోగలిగాయి

ఈ నవలలో ఆనా ఒక హృదయంలేని భూస్వామిని పెళ్లిచేసుకుంటుంది అతడు అవిత ... ఆ ... ప్రాప్తి... అనిడోళ్ల ఎదేశ.. ఆ మెలో ప్రేమ వికసించలేదు ఆనా మాయ చర్మం ఎరగనిది కనుకనే ఆ ప్రియునితోనే జీవయాత్ర సాగించదలచుకుంటుంది ఈ ప్రయత్నంలో ఆవిడ బ్రతుకు బండలవాలవుతుంటే ఎన్నెన్నబాధలనో ఎన్నెన్ని వ్యథలనో అనుభవిస్తుంది చివరకి ఆవిడకు, రాజాధిరాజులని ... సమానప్రేమతో ఆశ్రయమిచ్చే మృత్యుదేవత చల్లనికౌగిలిలో మాత్రమే శాంతి లభిస్తుంది

విషాదాంతమే అయినప్పటికీ ఒక జగత్తు, ఒక మానవప్రపంచం ... కర్కశ పాషాణసమానం దాని భయంకరమూతోరుగల గంభీర పెళపెళార్పాటులు విషాద సంఘటనలు

ఎన్నో మనకు టాల్‌స్టాయి లేఖిని సృష్టించిన ఈ మహోత్తమ నవలలో ప్రత్యక్షమవుతున్నాయి. అబ్లాన్‌స్కీ కుటుంబం గొడవల వర్ణనతో అతి విచిత్రంగా ప్రారంభమైన ఈ నవల ముగింపు ఎలా ఉందో చూడండి

"ఆమె (అనా) మొదటిపెట్టె చక్రాలక్రింద పడడానికి ప్రయత్నించింది. కాని తన చేతిలోని ఎర్రని సంచి విసరడంలో ఆలస్యమైంది ఆ పెట్టె దాటిపోయింది రెండోపెట్టెకోసం ఎదురు చూడవలసివచ్చింది. స్నానానికి నీటిలో మొట్ట మొదటి గంతువేసినట్లనిపించింది దానితో చిన్న నాటి విషయాలన్నీ ఆమెకు జ్ఞాపకంవచ్చాయి. వెంటనే ఆమె మనస్సును ఆవరించిన అంధ కారం ఎగిరిపోయింది జరిగిపోయిన జీవితం కళ్ళకు కట్టినట్లనిపించింది. కాని ఆమె తన కళ్ళను రెండోపెట్టె చక్రాలలోనుంచి మరల్చుకో లేదు. సరిగా ఆదేసమయానికి చక్రాల మధ్య భాగం ఆమె ముందుకు వచ్చింది ఆమె ఎర్ర సంచిని విసిరివేసి తన భుజాలపెనక్కి తల పెట్టు కొని చేతుల్ని ముందుకు చాపి పెట్టెక్రింద పడి పోయింది. తాను చేస్తూన్న పనికి ఆమె ఎంతో భయపడింది. "నే నెక్కడున్నాను? ఏం చేస్తు న్నాను? దేనిని గురించి?" అనుకుంటూ లేవ డానికి ప్రయత్నించింది. వెనుకకు రాబోయింది. కాని ఏదో పెద్దది నిర్దాక్షిణ్యమైనది, ఆమె తల మీద బలంగా కొట్టి, వెనక్కు దొర్లించివేసింది


ఉచిత

JAI HIND WATCH Co.
P B 97 SITLA TEMPLE AMRITSAR-


పేనగులాడి లాభంలేదమకొని ప్రభూ! నా తప్పు లన్ని క్షమించు అన్నది. కలలోని దింపిరిగడ్డం మనిషి ఆమెమీద ఇనుపముక్కలతో పనిచేస్తూ ఏదో గొణుగుకుంటున్నారు

బాధలతోను, అబద్ధాలతోను, దుఃఖాలతోను దుర్మార్గులతోనూ నిండివున్న పుస్తకాన్ని అనా ఏ దీపంసహాయంతో చదువుతుండో, ఆ దీపం ఒక్కసారి ఇదివరకెన్నడూ వెలగనంత ప్రకా శంతో వెలిగి చీకటిలోఉన్న ప్రపంచాన్నంతటినీ స్పష్టంగా కనబరచి భగ్గుమని మండి, మెల్లగా తగ్గి శాశ్వతంగా ఆరిపోయింది "

ఇంక అనువాదం సంగతి. శ్రీ ధర్మారావు గారు మూలంలో భావాన్నిమాత్రమే తీసుకుని చిన్నచిన్న వాక్యాలతో సూటిగా పాఠకుని మన స్సుకు హత్తుకుపోయేటట్లు తన మాటలతో పుస్త కాన్ని అంతనీ సంగ్రహంగా వ్రాశారు అని చెప్ప వలసివుంటుంది. చూడండి ఎంత శక్తిమంతమైన శైలిలో అనువదించారో

"నేను నీళ్లాడి ఉన్నాను" అని ఆమె మృదు వుగా స్పష్టంగా అన్నది. చేతిలో అకు మరింత రెపరెపలాడింది కాని, అత ఏ విషయం ఎలా అర్థంచేసుకుంటాడో చూడాలని ఆమె తన చూపులను అతనిమీంచి మళ్లించలేదు అతని ముఖం పాలిపోతుంది ఏదో చెప్పాదామను కున్నారు ఆగిపోయాడు ఆమె చేతిని విడిచి పెట్టి తలవంచుకున్నారు.

ఇక్కడ నీళ్లాడటం అంటే అనువాదకుల అభిప్రాయం "నీళ్లుపోసుకోవడం" కావచ్చు ఏమైనప్పటికి ఇలాంటి శైలిలో వ్రాయడం చాలా కష్టం అందులో పుస్తకం అంతా దాదాపు ఇలాగా నడపడం ఇంకా కష్టం ఈమాదిరి శైలి తప్ప కుండా చాలామందికి నచ్చగలదనడంలో నాకేమీ సందేహంలేదు

విశ్వసాహిత్యంలో ఉత్తమ రచనలను ఈ విధంగా తెలుగువారికి అందచేయడం చాలా అవ సరం అంతవరకు అందరూ అంగీకరించిందే. కాని ఆచరణలో ఇప్పుడు జరుగుతున్న కొన్ని విశేషాలను ఇక్కడ స్థాలీపులాకంగా మనవి చేస్తాను. ఇతర భాషలలో ఉత్తమ సాహిత్యాన్ని తెలుగుచేయాలన్న ఉత్సాహంతో ఒక్క పుస్త కాన్ని పదిమంది అనువదించి ప్రకటించడం జరుగుతున్నది మాటవరసకి చూడండి శరత్ సాహిత్యాన్ని ఎంతమంది తెనుగులోకి అనువదిం చారంటారు? వేలూరి శివరామశాస్త్రి, కొండలపాటి శివరామకృష్ణ, శేషురాజు, చక్రపాణి, సూర్యనారాయణ రావు శాస్త్రి ప్రభృతులు చాలామంది అనువదిం చారు. అందరూ అచ్చువేశారు అలాగే సెర్వాం టిస్ వ్రాసిన డాన్‌క్విక్సోటాన్ ముగ్గురో,నలుగురో అనువదించారు అచ్చువేశారు. ఫలితం? ఇందరి అనువాదకులలో ఎవరిది ఉత్తమమైనదో తెలుగు పాఠకులకు తెలుస్తుంది అంటేనా? వారికి కలిగే సాహిత్య పరిచయం ఇందువల్ల ఏమైనా అదనంగా పెంపొందడానికి అవకాశం ఉందా? మంచి పుస్త కాలు ఎంత ఖరీదైనాపెట్టి కొనుక్కొని చదవడం అలవాటులేని మన తెలుగుదేశంలో, అక్షరాస్యుల సంఖ్య చాలా తక్కువగా ఉండే మన సీమలో ఇందువల్ల పుస్తకాల ప్రచురణ వ్యాపారం దెబ్బ తినదా? అలాకాకుండా ఇప్పుడు మనలో హేమా హేమీ అనువాదకులందరూ కూడబలుక్కుని అందరూ తలో ఉద్గ్రంథాన్ని అనువదించి ఉంటే, మన భాషలోకి చాలా ఎక్కువ ఉత్తమ గ్రంథాలు ఏకకాలంలో మనసొత్తు అయ్యేవికావా? విశ్వ సాహిత్యంలో ఉత్తమ గ్రంథాల కనీసం ఒక వంద అయినా మన భాషలోకి వచ్చేవరకు ఒకరు అనువదించి, ప్రచురించిన పుస్తకాన్ని మరెవ్వరూ అనువదించి, ప్రచురించకుండా వుండడం వాంఛ నీయం కాదా? ఈ సూచనను గురించి ఆలోచించ వలసిందని ఇటు రచయితలకీ, అటు ప్రచురణ కర్తలకీ కూడా ఈ అవకాశాన్ని—కొంతవరకు అప్రస్తుతమే అయినప్పటికి ఈ ప్రస్తుత విమర్శ అనువాద గ్రంథానికి సంబంధించినది కనుక— పురస్కరించుకొని విజ్ఞప్తి చేయడానికి సాహసి స్తున్నాను.

ఇంతకీ చెప్పవచ్చింది ఇట్టి గ్రంథాల ప్రచురణ ద్వారా ఆంధ్రసాహిత్యం పెంపుకు ఇంటింటి విజ్ఞానమాల సాగిస్తున్న కృషి అభినందనీయమని ఇప్పుడు నేను పైన చేసిన సూచనను గురించి వీరుకూడా ఆలోచించాలని కోరుతున్నాను.

టాల్‌స్టాయ్ అంతటివాడు వ్రాయగా, ప్రపంచ మన్నన పొందినట్టి మహోత్తమ గ్రంథాన్ని "మూలమే తెలుగా" అనిపించేటంతటి సులభ సుందరమైన శైలిలో అనువదించినందుకు శ్రీ కాపీ ధర్మారావుగారిని, ప్రచురించినందుకు ఇంటింటి విజ్ఞాన మాలవారిని మనసారా అభినందిస్తున్నాను.

ఎంతో అందంగా ముద్రించిన ఈ పుస్తకంలో కూడా అచ్చుతప్పులుండడం శోచనీయం. తెలుగు పుస్తకాలలో అసలు అచ్చుతప్పులంటూ ఉండని సుదినం ఎప్పుడో గదా!

—భావుకి

## కోటిరెడ్డి కథ

(బుఱ్ఱకథ)

రచన శ్రీ చిరంజీవి క్రౌను 46 పుటలు వెల అరణాలు ప్రకాశకులు ఆదర్శ గ్రంథమండలి, విజయవాడ

"కోటిరెడ్డి" అనే ఒక ప్రతివాదియొక్క సామ్య సిద్ధాంతాలను వివరించే చిన్న జీవితచరిత్ర యిది. "నా నవిక సంఘటనలను యథాతథంగా చిత్రించి— నా ప్రతికకు విలువ చేకూర్చాలని నా కోర్కె" అని గ్రంథకర్త తెలియజేసియున్నారు. కథ ఆకర్ష ణీయంగా ఉన్నది.

బు. వేం. ర

## ఉత్పలిని

ఖండకావ్యముల సంపుటి ప్రథమ భాగము రచన శ్రీ ఉత్పల సత్యనారాయణాచార్య క్రౌను 44 పుటలు వెల ఒక రూపాయి ప్రకాశకులు జాతీయ సారస్వత కళాపీఠం, తెనాలి

ఈ కావ్యసంపుటిలో ౨౦ శీర్షికలలో కవి రచించిన ఖండికలు ఈయబడినవి "శీమ సరి జానము" పెద్ద ఖండిక దానికంటె చిన్నది "వరిదయము" తక్కినవి పుట కొక్కటిచొప్పున కూర్చబడినవి

ఈ రచనలలో వివిధములగు భావములు హృదయంగమముగ కూర్చబడినవి. కవికి మంచి ఉపజ్ఞ కలదు చక్కని పదముల కూర్పు. ధార్మికొంది విరామహీనముగ రచన సాగించు ఆరాశుద్ధియు కలదు కాని భాషావాఙ్మయముల పరిచయము తక్కువ యైనట్లు క్రింది కొన్ని ప్రయోగములవలనఁ దెలియుచున్నది.

"సుధామధుద్రవోత్పన్నకమైన (పుట 1)" "శిపాసవరుండ!—ప్రోజ్వలజ్వలిత (పుట 5" "పోవకు—వాపోవకు—కుమిలిపోవకు—వాడిన తెంపుదామరమాపై (పుట 10)" "కూర్పాని (పుట 11)" "అనంత చిరకాలము (పుట 12)" "పాడుకొనంగమందు వాళ పాటయే (పుట 23 పాడుకొనుమందువు—అను ఒక)" "కృత్రిమా లోపమానవత్వపుం (మానవత్వపుం అనుటకు) గాంచి (పుట 27)" "బొదుగలించి (పుట 34)" "బలమును బల్మిచే నెదురవచ్చు బరాక్రమశైన వారు (పుట 40)" "నాగరీక ప్రజల్ (పుట 41)"

"ఇదకె, పటోత్కటుండిచట
నే సరిపోయె వసా! కొంగావి వోరిలో"

అనునెడ ఛందస్సు తప్పినది

"ఉత్తలమంది కాంతివడె
జాతతి మానవులన్ కటారివాల్"

ఇచట యతి భంగము.

విసంధి స్వేచ్ఛగా పాటింపఁబడినవి. "కతము"నకు "గతము" వాడఁబడినది "పోరి బోదమున్, చెప్పుకొందురున్" మున్నగుచోట్ల ఛందస్సునకై సమర్పయిము. "పటుకవు నెంత సిర్చినను, నాకయి నెదో, ఎంత ఏమారక మంటివో, జాతకే నితరు, తెలంగి నొక్క మగ నారిపైన్" మున్నగుచోట్ల కళలపై ద్రుతము కూర్చఁబడినవి కొంత పరిశ్రమ చేసినయెడల ఈ కవి ఉత్తమకవిత నల్లఁగలుగును

బు. వేం ర

## తపతి

ఖండకావ్యము రచన శ్రీ ఉత్పల సత్యనారాయణాచార్య క్రౌను 24 పుటలు వెల ముప్పావలా ప్రతులు లభించు చోటు వెంకట్రామా అండ్ కో, విజయవాడ

తపతీసంవరణుల కథ మూలముగా ఈ ఖండ కృతి రచింపఁబడినది. ఈ కృతిని గురించి రచ యితయే "ఇది భావవాక్శ్రుతిలోని ఒక కళాచిత్రము ఇందులోనివి ఛాయాపాత్రలు రూపాలు కాల్ప నికాలు ఈ కళానుభూతి మాత్రము ఏకాంత మయినది" అని వివరించియున్నారు

ఇందు రచన విరామహీనముగ సాగినది కవి భాష, వాఙ్మయములలో పరిశ్రమించి రచన సాగించినచో "నాగిణి నవయౌవనియై ప్రపంచ కము, రుచిరుజ్జ్వలభావ వాగ్రుచ్యమన్న—" మున్నగు ప్రయోగములు దొరకకుండుట కవకాశ మున్నది. ఉపజ్ఞ గల రచయిత కృషిచేయుచో ఉత్తమకవి యగుట కవకాశము కలదు.

బు. వేం ర

## సవరణ

ఇనవరి కిన్నెర పుస్తకసమీక్షలో "మొదటి భార్య" అనే పుస్తకానికి అనువాదకుల పేరు శ్రీ అప్పరర్ల సుబ్బారావుగారు అనుటకు బదులు శ్రీ అప్పికట్ల సుబ్బారావుగారు అని సరిచేసి పాఠకులు సవరణను గమనింతురుగాక।

—సంపాదకుడు


కేశ సంపదకు
రీటా
హిందూదేశమంతటా
దొరకును

స్విస్ సృష్టి

ఎన్నదగిన విశిష్టత

## —అధునాతనం—

"ఫైలెక్సు, జాసన్"

స్త్రీలకు, పర్సులకు, డాక్టర్లకు, మంత్రసానులకు వచ్చే మోడల్స్
లేడీస్ 5 1/4" రెక్టాంగులర్ 17 జ్యూయల్స్ లివర్ 20 మైక్రోన్సు
రోల్డుగోల్డు దారాలకు అనుకూలమైన లూప్స్ వెల రూ 120/—

**3 సంవత్సరాలు గ్యారంటీ**

**JALAL & SONS,** జలాల్ అండ్ సన్సు

Watch Makers & Jewellers

Head Office
X 46 Rattan Bazaar Madras 3

Branch
Abid Road, Hyderabad (Dn)

సం॥ చందా
రూ.6-0-0

# వినోదిని

విడి ప్రతి
రూ.0-8-0

(సచిత్ర మాసపత్రిక)

ఇరవై యేండ్లుగ విర్విఘ్నంగా సాగుతూ తెలుగుదేశానికి యథోచితంగా సేవచేస్తున్నది ఈ ఇరవై ఒకటవ సంవత్సరంలో సర్వాంగసుందరంగా వెల్వరించేందుకు కృషిచేస్తున్నాం మా యీ కృషికి పాఠకులు, రచయితలు చిత్రకారులు తోడ్పడ ప్రార్థిస్తున్నాం

ఏజెంట్లు లేనిచోట్ల ఏజెంట్లు కావాలి

వివరములకు

## వినోదినీ కార్యాలయం,




[ప్రజాహృదయం శీర్షికలో పాఠకుల ఉత్తరాలు ప్రకటింపబడతవి నేడు సమాజాన్ని కలవరపెడుతున్న ప్రధానమైన రాజకీయ ఆర్థిక సమస్యలనుగూర్చి గాని భాష సాహిత్యం విజ్ఞానం సంస్కృతి, కళలు విద్యావిధానం మొదలుగాగల విషయాలనుగూర్చిగాని పాఠకులు జాబులు వ్రాయవచ్చును సూచనలు సాధ్యమైనంతవరకు నిర్మాణాత్మకంగా ఉండటం మంచిది రాజకీయాలనుగూర్చి వ్రాయబడు జాబులు పార్టీ రాజకీయాలకు సంబంధించినవి కాక, రాజకీయ సిద్ధాంతాలకు, తత్వానికి సంబంధించినవిగా ఉండాలి ప్రయోజనకరములైన జాబులు మాత్రమే ప్రకటింప బడతవి పాఠకుల జాబులు కిన్నెరలో ప్రకటితములైన యెడల అట్టివారికి మూడు నెలలవరకు కిన్నెర ఉచితంగా పంపబడుతుంది సం]

ఆంధ్ర కళా పరిషత్తు

ఆంధ్ర సాహిత్య పరిషత్తు(హైదరాబాదు) ఏడవ వార్షిక సమావేశం ఇటీవల ఆలంపురంలో జరిగినప్పుడు ఆంధ్రదేశంలోని రచయితలు అందరూ సమావేశమై ఆంధ్రకళా పరిషత్తును స్థాపించినట్లు పత్రికలలో చదివాము సారస్వత పరిషత్తు కేవలం ఒక్క హైదరాబాదు రాజ్యంలోనేకాక యావదాంధ్ర దేశానికి సంబంధించిన సారస్వత సాంస్కృతిక విషయాల అభివృద్ధికి పూనుకోవడం సంతోషకరమైన విషయం ఫిబ్రవరి నెల కిన్నెరలో మీరు వ్రాసినట్లు మూడు ముక్కలుగా చీలిపోయిన ఆంధ్రులనందరినీ రాజకీయంగా కాకపోయినా సాంస్కృతికంగా నయినా సరిదిద్దగల సంస్థగా ఈ ఆంధ్రకళా పరిషత్తు పనిచేయగలిగితే ఎంతయు ప్రశంసనీయమయిన విషయం

ఇదివరదాకా కోస్తాజిల్లాలలో ప్రభవిల్లిన సారస్వతోద్యమాలలో తెలంగాణా వాసులకు ఏమంత ప్రత్యక్షమయిన ప్రసక్తిలేకుండెను అట్లే గత పదేళ్లనుంచీ తెలంగాణంలో కృషిచేస్తున్న ఆంధ్రసారస్వత పరిషత్తు తన కార్యక్షేత్రాన్ని తెలంగాణానికే పరిమితం చేసుకొన్నది ఈ ఆంధ్ర కళా పరిషత్తు యావదాంధ్ర సారస్వతప్రియులను కూడగట్టుకొని, ఒక వేదికపైకి తీసికొనివచ్చి అధికారంతో నడిపించగల సంస్థగా రూపొందేటట్లు చేయడం అందరి విధీని ముఖ్యంగా కోస్తా జిల్లాలవారు ఇది జయప్రదంగా జరిగేటట్లు చూడవలసిన పూచీ ఎక్కువగా ఉంటుంది తెలంగాణం అందుకు సముచిత ప్రోత్సాహాన్ని ఇవ్వడానికి వెనుదీయదని భావించవచ్చునా ?

"ఒక ఆంధ్రుడు"

వ్యావహారిక భాష

"వాడుక భాష విశ్వ విద్యాలయాలు" అనే పేరుతో మీరు నవంబరు (52) కిన్నెరలో వ్రాసిన వ్యాసాన్నీ ఇటీవల మీరు తెలుగు పత్రికలలో ప్రచురించిన "వ్యావహారిక భాషాపండితులు" అనే ప్రకటననూ చదివాను వ్యావహారిక భాషకు విశ్వవిద్యాలయాలలో ఇంతవరకూ చోటు ఇవ్వకపోవడం చాల శోచనీయం ఆంధ్రుల సంస్కృతికీ భాషకూ సాహిత్యానికీ ప్రోత్సాహాన్నిచ్చి జాతినంతను చైతన్యవంతంగా చేయవలసినబాధ్యత ప్రధానంగా ఆంధ్ర విశ్వవిద్యాలయంమీద ఉన్నదంటే ఎవరికీ ఎటువంటి అభిప్రాయభేదము ఉండదు

ఆంధ్ర విశ్వకళాపరిషత్తు ఆవిర్భవించి పాతిక సంవత్సరాలయినా ఆంధ్రుల సాంస్కృతిక జీవనానికి ఉద్దీపననిచ్చే ప్రణాళికలు ఇంతవరకూ చెప్పుకోతగ్గవి ఏమీ జరగలేదు తెలుగు భాషలోని మహాకవుల రచనలకి శుద్ధప్రతులను ప్రకటించడం ఆంధ్ర సారస్వతానికీ ఆంధ్ర చరిత్రకూ సంబంధించిన రచనలను ప్రకటించడం ఆంధ్ర విశ్వకళాపరిషత్తువారు చేయవలసిన ముఖ్యమయిన పనులని మనవిచేయడం తప్పుకాదు

అట్లాగే తెలుగు దేశంలో నేడు వ్యవహారంలో వున్న భాషను దృష్టిలో ఉంచుకొని సమగ్రమయిన వ్యాకరణాన్ని రచించడానికి విశ్వవిద్యాలయం నడుం కట్టవలెనని నా ప్రార్థన అట్టి వ్యాకరణాన్ని విశ్వవిద్యాలయం ఆమోదించి పఠనీయ గ్రంథంగా ఏర్పరచవలసి ఉంటుంది అంతేకాని జీవద్భాషను గుర్తింపని తెలుగు వ్యాకరణం ప్రయోజనకరం కాదు కావున, ఆంధ్ర విశ్వవిద్యాలయ కార్యనిర్వాహకులు ఏతత్కార్యానికి పూనుకోవాలని నా సవినయ ప్రార్థన

వ్యావహారిక భాషకై "కిన్నెర" జరుపుతున్న కృషి ప్రశంసనీయం అది జయప్రదం కావాలని మనసార కోరుతున్నాను

బెజవాడ (8-2-53) ఎస్ వి రామారావు

